

# తక్షణ శక్తిదాయక అద్వితీయ పానీయం
# జిల్లనిపించే నారింజ రుచి గలది

గ్లాక్సో కానుక




ఎక్కువ ధరైన పంచదార కలపనవసరం లేదు

గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి, మీ బిడ్డను ఉరుకుల పరుగుల ఉత్సాహంతో నింపి ఉంచే, అనుకూలమైన సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్ళు, ఎముకలు, శరీర ధాతువుల పెంపుదలకు అత్యవసరమైన విటమిన్ సితో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో నాలుగు టీ స్పూన్ల గ్లూకోన్-సి కరిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ఉల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.






# గ్లూకోన్-సి

GLL-1174 R

V.V.D

ఊహలలో విహరించే
నవయౌవన సుందరాంగి
ఆమె హృదయాన్ని దోచుకున్నది ఎన్నెన్నో.
అల్లనల్లన సాగే అందాల సెలయేరు
హాయి హాయిగ వీచే చల్లని మలయ మారుతం
హృదయాన్ని చూరగొన్న సొగసైన చెలికాడు
రంగు రంగుల కోమల కుసుమాలు
నిగ నిగలాడే సుదీర్ఘ శిరోజాలు
ఆ శిరోజాలకు
వి.వి.డి. కొబ్బరి నూనె



VVD-3/86 R




# వి.వి.డి. కొబ్బరి నూనె

*సహజ శిరోజాల యౌవన రహస్యం*

V.V.D

## ముఖచిత్రం

గంభీర వదనములో
అమాయకత్వం తొంగి చూడ
ఆంధ్రసచిత్ర వారపత్రిక
ముఖచిత్రమై నిలచియున్న
సుమధుర హాసిని సుహాసిని
తీయని తలపులా
మాయని గురుతుగా
మదిని జేరి
మమ్ము మురిపించెన్

–మంతెన విజయలక్ష్మి, విజయవాడ

★ ★ ★

జాతీయ ఉత్తమ అవార్డు గ్రహీత 'సుహాసిని' ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక మమ్మలిని ఎంతో ఆకర్షించింది.

-కాజ హనిత, ఏలూరు

## సీరియల్స్

ఉత్తమ నటి "సుహాసిని" ముఖచిత్రంతో వెలువడిన "ఆంధ్రసచిత్ర వారపత్రిక" చాలా ఆకర్షణీయంగా ఉంది. క్రొత్త సీరియల్ "నిశ్శబ్ద సంగీతం" ప్రారంభంలోనే మమ్ములను ఆకట్టుకొంది.

-పి. శ్రీపతి, మహబూబాబాద్

★ ★ ★

8–14 ఆగష్టు సంచిక ముఖచిత్రం 'సుహాసిని' ముగ్ధ మనోహరంగా వుంది.

ఈ వారం ప్రారంభమైన కొత్త సీరియల్ "నిశ్శబ్ద సంగీతం" ఆసక్తికరంగా వుంది.

–వక్కలంక రామారావు, మానేపల్లి

★ ★ ★

మా అభిమాన నటి, ముగ్ధమోహిని, నటనారాణి, మధుర ధరహాసిని "సుహాసిని" ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయంగా వుంది.

బెహరా వెంకట సుబ్బారావు గారి "నిశ్శబ్ద సంగీతం" ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది. కాకాని కమల గారి "జీవితం చేజారిందా" చాలా ఆసక్తికరంగా సాగుతుంది.

-మహ్మద్ సర్వార్ పాష, సొల్లేటి రాంబాబు, పుల్లూరు

★ ★ ★

'కొత్త రవీంద్రబాబు' గారి సంకెళ్ళెవరికి సీరియల్ చదవటానిక ఆసక్తిగా ఉంది. "బెహరా వెంకట సుబ్బారావు" గారి నిశ్శబ్ద సంగీతం ప్రారంభంలోనే బావుంది.

–రమణమూర్తి గౌడ్, కొవ్వాలి

★ ★ ★

'సర్పయాగం' సీరియల్‌ను వీరపల్లె వీణావాణి గారు చక్కగా ముగింపు చేసారు. దోపిడి, దౌర్జన్యం ఉన్న ప్రతి చోట తిరుగుబాటు ఉంటుందనే చారిత్రక సత్యం సమాజంలోని నాగరాజు లాంటి నీచులకు చక్కగా హెచ్చరించారు. రచయిత గార్కి ధన్యవాదాలు.

–కె. వెంకటరావు, భిలాయినగర్




సుహాసిని ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయముగా ఉంది. "సంకెళ్ళెవరికి", "కరిగిన శిల" సీరియల్స్ మాకెంతగానో నచ్చాయి.

-పి. వి. జె. బి. నరసింహాచార్యులు, అనపర్తి

## శీర్షికలు

"సుహాసిని" ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా అందంగా, ముచ్చటగా, ఆకర్షణీయంగా వుంది. ఇందులో "అభిమాన తారలపై అభిప్రాయాలు", "విజయశాంతి సమాధానాలు" మాకు ఆసక్తిని కలిగించి చదివింపజేశాయి.

–దువ్వాడ శ్రీకాంత్, కాశీబుగ్గ

## కథలు

నా అభిమాననటి సుహాసిని ముఖచిత్రంతో వచ్చిన పత్రిక ఆకర్షణీయంగా వున్నది.

ఎం. ఠీ. సౌజన్యగారి "ఇది నడుస్తున్న చరిత్ర" చాలా బావుంది.

-కె. హెచ్. రామకృష్ణారెడ్డి, బెంగుళూరు

★ ★ ★

ఈ వారం 8–14 ఆగస్టు జాతీయ అవార్డుగ్రహీత సుహాసిని ముఖచిత్రంతో వెలువడిన పత్రిక మంచి ఆకర్షణీయంగా ఉంది. కథలు రక్తాశ్రువు, మేడ్ ఫర్ ఈచ్ అదర్, ది ఫ్రెండ్ ఇన్‌నీడ్ చాలా బాగున్నాయి.

–ఎస్. భిల్లేశ్వరరావు, నౌపడా

★ ★ ★

8–14 ఆగష్టు 1986 నటి సుహాసిని ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. కథలు "మేడ్ ఫర్ ఈచ్ అదర్" మరియు "పెద్ద మనసు" చాలా బాగున్నాయి.

-చోడాబత్తుల సరోజ, సత్యనారాయణ, కుప్పనపూడి

★ ★ ★

నటి సుహాసిని ముఖచిత్రంలో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక చూడ ముచ్చటగా ఉంది. కె. తాయారమ్మ గారి "పెద్దమనసు" కథ మా హృదయాన్ని ఆకట్టుకుంది. మేడ్ ఫర్ ఈచ్ అదర్ దేవినేని ఉషగారి కథ చాలా బాగుంది.

–డి. నర్సింగరావు, డి. విజయలక్ష్మి, పటానుచెరువు

★ ★ ★

"సుహాసిని" ముఖచిత్రంతో వెలువడినన నా అభిమాన "పత్రిక" చాల బావుంది. "మేడ్ ఫర్ ఈచ్ అదర్" కథ అద్భుతం.

-సాయిని రాజు, నేలకొండపల్లి □


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

19-25 సెప్టెంబర్, 1986
శ్రీ అక్షయ నామ సం. భాద్రపద బ. పాడ్యమి
సంపుటము 79 : సంచిక 3

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6నెలల చందా | రు. 71.50 |
| పోస్టులో 12నెలల చందా | రు. 143.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
"అడవి రాజా"లో శోభన్‌బాబు

# న్యూస్ రీడర్ కనురెప్పల చివరలూ స్పష్టంగా కనుపించాయి అంటే



# అది సోలిడైర్ అయితీరాలి!

వార్తలు చదువుతున్నప్పుడే టీవీ బొమ్మ నిర్దుష్టత నిర్ధారణ చెయ్యగలం. ఎందుకంటారా? అది లైవ్ అయినది. వార్తలు చదివే వారు, సక్రమమైన లైటింగు మధ్య, ఒకేచోట అమర్చిన కెమెరాకు ఎదురు ముఖంగా కూచొని చదువుతారు. అంటే పొరబాటు ఫోకసింగుకు-ఏవిధమైన అవకాశమూ లేదు.

ఇతర టీవీలలో వార్తలు చదివే కార్యక్రమం చూడండి. దాన్ని సాలిడేర్ స్పష్టతతో పోల్చి చూడండి. వార్తలు చదివేవారి కనుబొమల్లాగే. సాలిడేర్ టివిలో మీరు ప్రతి అతిసూక్ష్మ అంశాన్నీ దర్శించగలరు.

సాలిడేర్‌లోని బొమ్మయొక్క నిర్దుష్టత, ఖచ్చిత గుణం, అదనపు ప్రదీప్తి ఇవన్నీ విషన్ ఇన్‌టర్మీడియెట్ ఫ్రీక్వెన్సీ (VIF)లోని గొప్ప సాధనవల్ల ఏర్పడినవి.

అయితే, సాలిడేర్‌లో కేవలం సాంకేతిక కౌశలం ఒక్కటే వుందనుకోరాదు. అందులోని ఆటోమేటిక్-నాయిస్-క్యాన్సలేషన్ సర్క్యూట్ తెరమీది బొమ్మ గిరగిరా తిరిగి పోవడాన్ని అరికడుతుంది. ప్రతి సాలిడేర్ టీవీ వర్షాకాలంలో ప్రత్యేక ట్రాపికలైజేషన్‌ద్వారా రక్షించబడుతోంది. దానికి తోడు, మీ టీవీవల్ల మీరు అధిక సౌకర్యాలు పొందగలిగేలా, సాలిడేర్ ఆడియో ఔట్‌పుట్, విసిఆర్ కనెక్షన్, టేప్-ఇన్ అండ్ ఔట్ కనెక్షన్లు వెగైరాల్లాంటి విషయాలమీదకూడా ఎక్కువ శ్రద్ధ తీసుకుంటోంది.

అన్నిటినీ మించి, సాలిడేర్ తన సాటిలేని 'అమ్మకం తరువాత సిబ్బంది' సహాయంతో మీకు అవసరమైతే, కోరినదే తడవుగా, మీ సర్వీస్ అవసరాలను గమనిస్తుంది.




# Solidaire

## -that seldom fails!

# సమస్యల నుంచి తప్పించుకోటానికే సమావేశాలు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

రోమ్ నగరం తగలబడి పోతుంటే నీరో చక్రవర్తి ఫిడేలు వాయించాడంటే దానికి అర్థం శాస్త్రీయ సంగీతంపై ఆయనకి తగని మక్కువ ఉన్నదని కాదు. అలాగే రాజీవ్‌గాంధీ విదేశాలలో శాంతి సమావేశాలు, జాతి వివక్షణ సమస్యల మీద ప్రగాఢమైన ఆసక్తిని పెంపొందించుకోవటానికి కారణం ఆయనకి ఉన్నపళంగా మానవాళి భవితవ్యం పట్ల అనురక్తి ఏర్పడటం వల్ల కాదు. ఆనాడు నీరో తన సమస్యల నుంచి దూరంగా పారిపోవటానికి అలా చేస్తే ఇప్పుడు రాజీవ్‌గాంధీ ఇలా చేస్తున్నారు. పది రోజుల పాటు లండన్ తదితర చోట్ల జరిపిన సమావేశాలు ఈ దేశంలోని విషాదకరమైన వాస్తవాల నుంచి తప్పించుకోటానికి ఒక సాకు వంటివి.

మెక్సికోలో జరిగిన శాంతి, నిరాయుధీకరణ సమావేశాన్నే తీసుకోండి. మెక్సికో ఋణ భారంతో కృంగిపోయి ఉన్నటువంటి దేశం. అది తన సమాజాన్ని అస్తవ్యస్తం చేసింది. అయినప్పటికీ శ్రీమతి గాంధీ ఆసియా క్రీడోత్సవాలు, కామన్‌వెల్త్ దేశాధినేతల సమావేశాల వంటి వాటిని నిర్వహించి నట్లే మెక్సికో ఇలాంటి వాటిని ఏర్పాటు చేస్తున్నది. పాల్గొన్న వాటిలో స్వీడన్ చాలా గౌరవనీయమైనదే కాని అది కేవలం పైకి మాత్రమే. పాకిస్తాన్ అణు పథకాలలో స్వీడన్‌కి ప్రధానమైన పాత్ర ఉన్నది. ఆ దేశానికి స్వీడన్ రహస్యంగా ప్లూటోనియంని విడగొట్టే ప్రత్యేక తరహా సామగ్రితో పాటు అవసరమైన యంత్రసామగ్రిని కూడా ఎప్పటి నుంచో సరఫరా చేస్తున్నది. స్వీడన్ ప్రధానమంత్రి కీ. శే. ఒలాఫ్ పాల్మె గతంలో భారతదేశానికి సైనిక సామగ్రి అమ్మడం కోసం సంవత్సరాల పాటు ప్రయత్నం చేసారు. ఆయన ఢిల్లీలో జరిగే నిరాయుధీకరణ సమావేశాలకీ, సదస్సులకీ హాజరైనప్పుడల్లా ఆ పని మీదే ఉండేవారు. తృతీయ ప్రపంచ దేశాలకి పెద్ద పెద్ద కబుర్లు చెప్పే ఫ్రాన్స్ ఒక కన్ను అణ్వాయుధాల పైనే వేసి ఉంచింది. శాంతి, మానవ సౌభ్రాతృత్వం గురించి పాటుపడుతున్నట్లుగా కల్లబొల్లి కబుర్లు చెప్పే అధ్యక్షుడు గల ఆ దేశం రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత నుంచీ అణుశక్తి వ్యాపారం చేస్తూనే ఉన్నది. పాకిస్తాన్ సహా ఎన్నో దేశాలకి అది అణుశక్తి సంబంధమైన పరికరాలని సరఫరా చెయ్యటంలో తీరిక లేకుండా ఉన్నది. ఈ దేశాల ప్రతినిధులు ఒక దేశం రాజధాని నుంచి మరో దానికి విమానాలలో వెళ్తూ బూటకపు కబుర్లు చెబుతూ, ప్రకటనలు చేస్తూ అదే సమయంలో ఉత్సాహ వంతులైనటువంటి తమ ఖాతాదార్లకి అణుశక్తి సంబంధమైన పరికరాలని, సామగ్రిని అంటగడుతూ ఉంటారు. మనమీద ఉపయోగించటానికి తప్ప మరే ఉపయోగం లేకపోయినా పాకిస్తాన్‌కి కూడా వాటిని అమ్ముతూ ఉంటారు. అలాంటి వారిని వెనకేసుకు రావటం వల్ల ఈ దేశానికి వొరిగిందేమిటి?




మన మీద దాడి జరిగినప్పుడు ఆ దేశాలేవీ మన సహాయానికి రాలేదు. 1962 లో చైనా వారు మనపై దాడి చేస్తే ఆఫ్రికా, పశ్చిమ ఆసియాలలోని ఏ ఒక్క దేశమూ నోరెత్తలేదు. 1965 లో మన మీద పాకిస్తాన్ దాడి చేస్తే యూరోప్‌లోని ఏ దేశమూ మనకి సహాయపడలేదు. మన మీద మళ్లీ పాకిస్తాన్ గానీ, చైనా గానీ దాడి చేస్తే స్వీడన్, ఫ్రాన్స్ వంటి పెద్ద కబుర్లు చెప్పే దేశాలు అమెరికాపై నిందని మోపుతాయి. పాకిస్తాన్, చైనాలు మనపై దాడికి సిద్ధం అయ్యేది ఫ్రాన్స్, స్వీడన్‌లు సరఫరా చేసిన సామగ్రితోనే.

జాతి వివక్షణ సమస్య, ఆంక్షల విషయాన్నే తీసుకోండి. ఎలా చూసినా ప్రిటోరియాపై ఆంక్షలు దురదృష్టవంతమైన ఆ దేశం మీదే కాక చివరికి జింబాబ్వే, జాంబియాలలోని సామాన్య ప్రజానీకంపై సందేహం లేకుండా దుష్ప్రభావాన్ని చూపిస్తాయి. ఆఫ్రికన్ నాయకులు అందరిలాగే జింబాబ్వే, జాంబియాలని పాలించే ముగాబే, కౌండా వంటి వారికి కూడా జూరిచ్, తదితర చోట్ల డబ్బు నిల్వలు పుష్కలంగా ఉండి ఉంటాయి. అలాగే ఘనాకి చెందిన నకిలీ సోషలిస్టు ఎన్‌క్రూమా మనకి గొప్ప మిత్రుడు. ఆయన కూడా, ప్రస్తుతం ముగాబేలాగే, గతంలో భారతదేశానికి వచ్చి శాంతి, సౌభ్రాతృత్వాలపై మనకి ఉపన్యాసాలు ఇస్తూ ఉండేవాడు. ఘనచే సరిగా లేదనుకుంటే ఆఫ్రికన్ సమాజంలో అసమానతలు మరింత ఎక్కువగా ఉన్నాయి. ముగాబే పాలనలో ఉన్న జింబాబ్వేలో ఆయనకి వ్యతిరేకంగా ఉన్న జాతుల అధీనంలో ఉన్న పల్లెలు, పట్నవాసాలపై నిరంతరం ఆయన సైన్యం విరుచుకు పడుతూ అక్కడి ప్రజలని ఒక పద్ధతి ప్రకారం ఊచకోత కోస్తూ ఉంటుంది. ఇది జాతి హత్య కాకపోతే మరేమిటో నాకు తెలియదు. వాణిజ్యం మొదలైన వాటికి ఈ దేశాలన్నీ దాదాపు పూర్తిగా దక్షిణ ఆఫ్రికా పైనే ఆధారపడి ఉన్నాయి. దాన్ని అరికడితే నష్టపోయేది ముగాబే కాదు, జింబాబ్వేలోని సామాన్య ప్రజలే. ఇప్పటికే వారు

ఆ ఖండంలో సాధారణంగా ఉండే పౌష్టికాహార లోపం, తదితర రుగ్మతలతో బాధపడుతూ ఉన్నారు. ముగాబే, కౌండాలు తప్పకుండా ఆ ఆంక్షలని తమకు అనుకూలంగా ఉపయోగించుకుంటారు. ప్రిటోరియా పాలన నిస్సందేహంగా జాతి పరమైనటువంటిదే. అది అలా కొనసాగటానికి ఎంత మాత్రం విలు లేదు. కానీ ఆఫ్రికాలోని ఇతర చోట్ల కూడా విచక్షణ తక్కువగా ఏమి లేదు. ఉత్తరాన ఇథియోపియాలో అయినా లేక పశ్చిమాన అంగోలాలో అయినా స్థానిక జాతుల మధ్య వారిలో వారికి సంఘర్షణలు లేనటువంటి దేశం లేదనే చెప్పవచ్చు. దక్షిణ ఆఫ్రికాలోని సంఘర్షణ కూడా ఒక రకంగా చూసే జాతుల మధ్య యుద్ధమే. అది తెల్లవాళ్ళకి, నల్ల వారికి మధ్య జరుగు తున్నది. అదే విధంగా జింబాబ్వేలో జులూ తెగకి మరో దానికి, నికరాగువాలో కూడా అటువంటి జాతుల మధ్యే పోరాటం సాగుతున్నది. భారతదేశం మీద ఆంక్షలు విధిస్తే అవి ఏవిధంగా నెహ్రూలనీ, అర్జున్ సింగ్‌లని బాధించవో అలాగే దక్షిణ ఆఫ్రికాపై ఆంక్షలు ముగాబే, ఆయన కుటుంబానికి ఏరకంగానూ హానికరంకావు. రష్యాలోని నిరాడంబరత గోర్బచెవ్ ఆయన కుటుంబానికి వర్తించదు. ఎందుకంటే వాళ్ళకి కావలసిన షాంపేన్, ఎలక్ట్రానిక్ పరికరాలు పారిస్, లండన్‌ల లోని విలాస వంతమైన చోట నుంచి తెప్పించు కోగలరు వాళ్ళు.

అసలు విషయానికి వస్తే ఈ బూటకపు నిరాయుధీకరణ ప్రకటనలకి అవి రాయబడిన కాగితాలకి ఉన్న విలువ అయినా ఉన్నదా? వారోషిమా నాటి నుంచి అలాంటి సమావేశాలు ఎన్ని జరిగి ఉంటాయో లెక్క పెట్టండి. మరో వైపు అణుశక్తి కేంద్రాలు ఎలా అభివృద్ధి చెందాయో పోల్చి చూడండి. ఆ కేంద్రాలన్నీ ప్రపంచం అంతటా అణ్వాయుధాల తయారికి పనికివచ్చే సామగ్రిని ఉత్పత్తి చెయ్యటానికి ఉపయోగ పడుతున్నాయన టంలో ఎంత మాత్రం సందేహం లేదు. ప్రస్తుతం ఫ్రాన్స్ తన విద్యుత్ అవసరాలలో 50 శాతం అణుశక్తి ద్వారానే ఉత్పత్తి చేస్తున్నది. అక్కడ అణుశక్తి పరిశ్రమే అతి పెద్దదైన ఏకైక పరిశ్రమ అనవచ్చు. అది ఉక్కు, ఇంజనీరింగ్‌లకన్నా పెద్దది. అక్కడ సాంప్రదాయకమైన రసాయనిక పరిశ్రమ కంటె మరింత పెద్దది.

భారి ఎత్తున అటువంటి అణుశక్తి పరిశ్రమ ఉన్న ఫ్రాన్స్‌కి తత్సంబంధమైన సామగ్రిని ఎగుమతి చెయ్యటం అన్నది తప్పని సరి. అది లేకుండా ఆ దేశం మనలేదు. స్వీడన్ అయినా అంతే. అది ప్రపంచ సైనిక విపణికి ఎప్పుడూ తన ఆయుధాలని సరఫరా చేస్తూనే ఉన్నది. నిజంగా ఈ దేశాలకి నిరాయుధీకరణ పై ఆసక్తి ఉన్నట్లయితే మొదట తమ దేశాలలోని అణు కర్మాగారాలని మూసి వేసి తర్వాత ప్రపంచానికి చెప్పాలి. అటువంటి వాటి సరసన మనం ఎంతో మూర్ఖులలాగ కనిపిస్తాము! □

సీరియల్

# పావని



సి. విమలాగణేశ్

(గత సంచిక తరువాయి)

"ఎక్కడి దాకా మేడమ్‌గారి ప్రయాణం?" తయారవుతున్న పావన్ని చూస్తూ అంది రోజి.

"అబ్బే ఎక్కడికీ లేదు" బొట్టు సరిచేస్తూ అంది పావని.

"కొయ్ కోత. నాకు తెలియదా?"

"ఏం తెలుసు?"

"బాయ్ ఫ్రెండుతో ప్రోగ్రామా?"

"రోజి, నోర్ముయ్."

"అలాగే. చెప్పు మరి."

"చెప్పానుగా ఎక్కడికీ లేదని."

"అదే నీ సమాధానమయితే నేను ఫాలో చేస్తాను తమర్ని."

"ఛీ అన్నీ పాడు బుద్ధులే."

"తెలుసుగా"

"సినిమాకి."

"ఎవరితో విజయ్‌తో నేనా?"

"ఔను."

"అబ్బా ఈ విషయం ముందే చెప్పి ఉండవచ్చుగా?"

"చెప్పకపోతే ఊరుకుంటావా?" స్లిప్పర్సు వేసుకుంటూ అంది.

"పావనీ నిన్ను రెండు సంవత్సరాలుగా చూస్తున్నా ఆ చీరలు తప్ప మరేవీ ధరించవా?" రోజీ పావన్ని అదోలా చూస్తూ అంది.

"అంటే త మరిలా జీన్సు, లాగూలు, షర్టులూనా?"

"వాటిల్లో అందం తమరికి తెలియదు." చిరునవ్వుతో అంది రోజీ.

"నిజమే కావచ్చు నా మట్టుకు నాకు చీరలే అందంగా ఉంటాయి."

"వట్టి పల్లెటూరు."

"నువ్వన్నా అనకపోయినా మాది పల్లెటూరే."

"మళ్ళీ చెంగు కప్పుకోవటమెందుకు ముసలమ్మలా?"

"అలవాటు."

"నిజంగా నీలో మార్పే లేదు పావని. ఇక నించి నేను కూడ నీలాగ మారతాను. నిజంగా చీరే నిండుగా కన్పిస్తుంది." చీర కుచ్చిళ్ళు కాళ్ళ దగ్గర సరి చేస్తూ అంది రోజి.

"నిజంగానా?"

"ఔను. మరి చీర కట్టటం నేర్పుతావా?"

"ఓ. ప్రారంభిద్దామా?"

"ఇప్పుడొద్దు. అక్కడ పాపం క్షణమొక యుగంలా విజయ్ నీ కోసం ఎదురు చూస్తూ ఉంటాడు. త్వరగా వెళ్ళు."

"థాంక్సు. వస్తా."

"వస్తా కాదు. వచ్చి ఆ సినిమా స్టోరి అంతా చెప్పాలి."

"అబ్బా నీతో ఇదో చావు. ఇక రాత్రికి నిద్రపోనివ్వవు."

"జాగర్త సుమా."

"ఎందుకు?"

"ఎందుకో? అందాల బొమ్మలా మెరిసి పోతున్నావ్. పాపం విజయ్ ఏదయినా చేస్తే."

"పోవే మరి బడాయి." వడి వడిగా నడిచింది పావని. చక్కని జంట. నిజంగా పావని ఎంత అదృష్టవంతురాలో విజయ్ కూడ అంతే. ఇద్దరూ ఒకరికొకరు తీసిపోరు. వాళ్ళకు పుట్టే పిల్లలు ఇంకెంత అందంగా ఉంటారో. ఆలోచిస్తూనే నవ్వుకుంది రోజి. రూం తలుపు మూసి వచ్చి మంచంపై వాలింది.

* * * *

పావని వడివడిగా నడుస్తూ బస్‌స్టాపింగ్ చేరింది. విజయ్, ఆమె కోసమే వెయిట్ చేస్తున్నాడు.

"ఇంత ఆలస్యమా?"

"ఏం చెయ్యను. రోజీ వదలందే."

"అబ్బా ఎప్పుడూ ఏదో ఒక వంకే."

"వంక కాదు నిజం."

"సరే పద బస్సొస్తోంది" ఇద్దరూ బస్సెక్కారు. ఆ బస్సులో విద్యార్థులు తప్ప బయటి వాళ్ళు చాల తక్కువగా ఉంటారు. బస్సు వేగంగా సిటీ చేరింది.

"దిగుదాం పద."

"ఇక్కడా! ఏ హాల్లో."

"జగదాంబలో."

"మరిక్కడ దిగడందేనికి?"

"అదంతా తరువాత. దిగు ముందు." దిగారిద్దరూ.

"హోటలు కెళ్ళి పార్టీ ఇద్దామని."

"పార్టీయా? దేనికి?" పావని అమాయకంగా ప్రశ్నించింది.

జరిగిన కథ – 1: యూనివర్శిటిలో ఎమ్. ఎస్. సి. చదువుతున్న వారిలో ప్రథమంగా గుర్తింపుకి వచ్చిన వ్యక్తి విజయ్. అతను గోల్డ్ మెడలిస్ట్. రెండవ వ్యక్తి అందాలరాసి యూనివర్శిటి బ్యూటీ పావని. లక్షల ఆస్థికి వారసుడయిన విజయ్ తల్లి, తండ్రి లేని అనాథ. పావనికి తల్లి లేదు. స్కాలర్‌షిప్‌తో చదువుకుంటోంది. రోజీ, దినేష్, మదన్, ఆనందరావులు విజయ్, పావనిల క్లాస్‌మేట్స్. తనను అవమానపరిచిన పావనిమీద కారాలు, మిరియాలు నూరుతూ వెళ్ళిపోతాడు మదన్. విజయ్, పావని ప్రేమించుకుంటారు. పెళ్ళి చేసుకోవాలని కలలు కంటుంటారు.

"అమ్మాయిగారికీ స్కాలర్‌షిప్ వచ్చినందుకు."

"మర్చిపోయాను."

"నాకు జ్ఞాపకముందిగా" ఇద్దరూ ఆ పెద్ద హోటలు చేరి కూర్చున్నారు.

"బాసంతి" విజయ్ ఆర్డరిచ్చాడు.

"బిల్లు నేనివ్వాలి" పావని చిరునవ్వుతో అంది.

"భార్యాభర్తల్లో ఎవరిచ్చినా ఒకటే" ఆ మాట వింటూంటే ఎందుకో పావని వళ్ళు పులకరించింది.

"ఎందుకలా చూస్తావ్. ఇంకా పెళ్ళి కాకుండా ఈ పెద్ద మనిషి ఇలా అంటున్నాడేమిటా అనా?"

"భలే వారే అటువంటి ఆలోచనలు నాకు రావు."

"మరి ఎలాటి ఆలోచనలు వస్తాయి."

"చెప్పమంటావా?"

"అనేగా అడిగేది."

"ఏమో బాబూ నాకు సిగ్గేస్తుంది."

"సిగ్గా! పరవాలేదే నా భార్యకూ సిగ్గుందే."

"లేదనుకున్నారా ఇంత కాలం."

"అదంతా తీరిగ్గా పోట్లాడుకుందాం: త్వరగా కానీ. మళ్ళీ టిక్కట్లు అందవు."

"ఆలస్యం నాదికాదు మీదే"

"అబ్బా నీతో వేగటం కష్టమే"

"తరువాత తీరిగ్గా ఆలోచించవచ్చు. త్వరగా పదండి. టిక్కట్లు అందవు." అదోలా చూస్తూ అంది.

"పరవాలే. నామాట నాకే అప్పచెప్పావు."

ఇద్దరూ సినిమాహాలు చేరారు. పిక్చరు పాతదయినా జనం ఎక్కువగానే ఉన్నారు. ముఖ్యంగా విద్యార్థి బృందం ఎక్కువ. టిక్కెట్లు తీసుకుని లోనికెళ్ళి కూర్చున్నారు. సినిమా ఆరంభం కాలేదింకా. పాటలు వేస్తున్నారు. "ఈనాటి ఈ బంధ మేనాటిదో – ఈనాడు పెనవేసి ముడివేసెనో" అనే వినసొంపయిన పాట రావటంతో ఇద్దరూ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. సినిమా ఆరంభమయింది. ఆడదాని రాజ్యకాంక్ష. చివరకు దారుణంగా ఒక రాజును హత్యచేయడానికి కూడా వెనుకాడని స్త్రీ కథ. చాలా బాగుంది. చిత్రం ముగిసిపోయింది. ఇద్దరూ బైటకు నడిచారు.

"త్వరగా పదండి. బస్సు దొరకదు." తొందరచేసింది పావని.

"పరవాలేదు. నడిచివెళదాం."

"మైగాడ్ – నడిచే. నేను నడవలేను బాబూ"

"పోనీ ఎత్తుకుని తీసుకెళతాలే"

"చాల్లేండి మీ వేళాకోళాలు. పదండి"

"ఆత్మారాముడు గోలపెడుతున్నాడు. భోంచేసిపోదాం."



# పావని

"భోజనమా? దేనికి హాస్టలు కెళదాం"

"అలాగా! లేటు మీల్సు చెప్పావా?"

"నేను చెప్పడం దేనికి? రోజి చెపుతుంది"

"చాల సంతోషం. మంచి ఫ్రెండు దొరికింది. అమ్మాయిగారికోసం భోజనం ఏర్పాటు చేస్తుంది. మరి మన విషయం" విజయ్ అదోలా ఆ వెన్నెలలో పావని ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"సరే. మా హాస్టలుకేరండి"

"పరవాలే, ధైర్యం కూడా వచ్చిందే."

"వెక్కిరించనవసరంలేదు. ఆవతల బస్సు పోతుంది త్వరగా"

"సరే పద" ఇద్దరూ వెళ్ళి బస్సెక్కారు. బస్సు సరాసరి హాస్టలు ముందాగింది. దిగారిద్దరూ. పావని హాస్టల్ రానేవచ్చింది.

"గుడ్‌నైట్. వస్తా" విజయ్.

"అదేమిటి భోంచేసి వెళ్ళండి"

"నో. థాంక్స్ మీరు వెళ్ళి చెయ్యండి."

"మళ్ళి ఏమిటండి. మరి ఇంతగా బతిమాలించుకోవటం ఏమి బాగుండలేదు."

"ఈ నాలుగు రోజులేగా"

"నాలుగు రోజులా?"

"ఆ మూడు ముళ్ళూ పడ్డాక ఎలాగూ బతిమాలవు. పైగా నాతోనే బతిమాలించుకుంటావు"

"సర్లే రండి"

"లేదు పావని నాకోసం అన్నీ ఉంచుతాడు. ప్లీజ్ నువ్వెళ్ళు"

"నిజంగానా"

"నిజమే"

"మరి ఇందాక"

"అలా అన్నానే అనా? సరదాకి ఒ. కె. వస్తా." ఇద్దరిదారి వేరయింది. సన్నగా ఈలవేస్తూ కదిలాడు విజయ్ పట్టరాని సంతోషంతో కదిలింధి పావని.

"ఏం.పిక్చరో" రోజి.

"మేక్ బత్"

"ఓ దర్టీరోగ్. ఆ పిక్చరని నాతో చెపితే వచ్చేదాన్నే. ఈ పిక్చరని చెప్పనేలేదే?"

"సరేగొడవెందుకు భోజనముందా?"

"ఆ వుందిలే"

"సరే పద"

"నేనా"

"ఆ, నేను లేకుండా నువ్వు భోంచెయ్యవని తెలుసు. పద"

"ఆ మాత్రం జ్ఞాపకముంది థాంక్సు" ఇద్దరూ నడిచారు చకచకా.

* * * *

పాల పొంగుల సొగసుగల భానుని పసిడి కిరణాలు రూంలో పడుతున్నాయి. లేచింది పావని. రోజి రాత్రంతా నిద్రపోనిచ్చింది కాదు. రోజీ లేచింది. ఇద్దరూ స్నానం చేసి వచ్చారు.

"నాకు చీర కట్టు"

"నిజంగానా"? పావని ఆశ్చర్యంగా చూసింది రోజి ముఖంలోకి.

"నిజం"

"సరే రా"

"చీరలు లేవుగా" రోజి.

"నాకున్నాయిగా" మంచి చీర కట్టి, తల దువ్వి జడేసింది.

"బొట్టుపెట్టనా?" అడిగింధి పావని.

"పెట్టు". పెట్టింది పావని.

"అబ్బా ఎంత అందంగా ఉన్నావో రోజీ, నిజంగా నా దిష్టే తగులుతుందేమో"

"ఈమధ్య నువ్వు మరి కోస్తున్నావ్"

"సరే పద"

"పావనీ అన్నీ చేశావ్. ఒక్కటి మర్చిపోయావ్"

"ఏమిటది"

"పూలు"

"అలాగా వాటి కోసం ఎక్కడికెళ్ళేది"

"కంగారొద్దు. ఇవిగో" రోజీ పూలందించింది.

"ఎక్కడివి"

"నిన్న సాయంత్రమే సంపాదించా"

"గుడ్" అందంగా తురిమింది.

రోజూ రక రకాల డ్రస్సుల్లో చాల సెక్సీగా వచ్చే రోజి చీరలో మరి సెక్సీగా కన్పిస్తోంది. అందంగా నడుస్తున్నారు. అందరూ రోజి వంక ఆశ్చర్యంగా చూడడం, నవ్వడం రోజి కంటబడింది.

"పావనీ ఎందుకే వాళ్ళంతా అలా నవ్వుతారు"

"నిన్ను చూసే"

"నన్ను చూశా. వాళ్ళు నవ్వవలసినంత తప్పేం చేశాను?" అమాయకంగా అంది.

"నీ అలంకారం చూసి"

"ఏం నా అలంకారానికేం"

"అదేనే చీరంటే తెలియని పిల్ల ఇంత అందంగా చీరకట్టి, జడవేసి, పూలు పెట్టి బొట్టుపెట్టి ఆకాశంలో చందమామలా మెరిసిపోతూందికదూ అందుకని"

"ఛీ. పో నీదంతా మరి"

"సరే పద క్లాసుకి"

ఇద్దరూ నడిచి క్లాసురూం చేరారు. స్టూడెంట్సే కాదు. ఆరోజు ప్రొఫెసర్ నుంచి లెక్చరర్ వరకు రోజీ అలంకారంవైపు అదోలా చూసి చిన్నగా నవ్వుకున్నారు. చీరలో రోజి చాల అందంగా కనిపిస్తుంది. ఆంగ్లో ఇండియనులా లేదు. అచ్చమయిన హిందూ మహిళలా ఉంది. రోజి ఇకపై తాను రోజూ చీరలే కట్టుకోవాలని నిర్ణయించుకుంది.

* * * *

రెండు సంవత్సరాల కాలం అతివేగంగా కదిలిపోయింది. పరీక్షలు దగ్గర పడ్డాయి. ప్రిపరేషన్ హాలిడేస్ ఇచ్చారు. అందరిలాగే వాళ్ళ డిపార్టుమెంటులోను

## శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

అస్థిభరితమ్ము నీదు దేహమ్ము జూడ
దుప్పటింబోలు తనువుపై తోలు జూడ
మలము మూత్రమ్ము క్రిములును కలవు లోన
అట్టి దేహమ్మునకు కుల మెట్టులుండు?

ఊరుజేరంగ చక్కని దారి జూపు
మార్గదర్శకు కులమదేమైన నేమి?
పరము తత్త్వము బోధించు గురువరేణ్యు
కుల విచారణ నీకేల కుత్సితుండ!

అందరు నడచుచుండెడి అవని యొకటి
సర్వమానవుల్ ద్రావెడి జలము నొకటి
అందరిని కాల్చుచుండెడి అగ్నియొకటి
ఇట్టులుండగ కులము లవెట్టువచ్చె

—కనమలూరు వెంకటశివయ్య



# ఇదిగో వచ్చింది
# 8 అవర్స్
## ఇక మీద దోమలకు
## ప్రతి నిత్యం జాగరణే

8 అవర్స్ రక్షణా అని మీరిక హాయిగా నిద్రపోవచ్చు. మీ ఇంట్లో దోమలు మాత్రం దీని దెబ్బకు తమ రెక్కలకు బుద్ధి చెప్పవలసిందే.

8 అవర్స్ ఒక విభిన్న తరహాకు చెందిన దోమల నివారిణి. ఇదొక ప్రత్యేకమైన పుష్-అప్ ప్యాకులో అమర్చబడిన స్టిక్ రూపంలో వస్తుంది. అంటే దీన్ని ఉపయోగించడానికి, వెంట పట్టుకెళ్లడానికి కూడా ఇదెంతో అనుకూలమైనదన్నమాట.

దోమలు కుట్టగల శరీర భాగాలపైన దీన్ని పొడిగా రాశారంటే చాలు.

దీనితో జిడ్డూ ఉండదు. మంటా ఉండదు సరికదా. మంచి సువాసనగా ఉంటుంది. అన్నిటికన్నా ముఖ్య విషయమేమిటంటే, 8 అవర్స్‌లో, మామూలు రకం దోమల నివారిణుల కంటే మరింతకాలం మరింత శక్తివంతంగా పనిచేసే సక్రియ పదార్థం ఉంది.

8 అవర్స్ నిరపాయకరమైనది. సున్నితమైన చర్మాలపై కూడా వాడవచ్చు. చిన్న పిల్లల వంటిపై కూడా రాయవచ్చు.

8 అవర్స్. అంటే దోమలకు శివరాత్రి. మీకు శుభరాత్రి




## 8 అవర్స్
వంటిపై రాసుకునే
దోమల నివారక
స్టిక్



WOCKHARDT
Excellence through commitment

# పావని

గ్రాండుగా పార్టీ, ఫొటో ఏర్పాటు చేసుకున్నారు. యూనివర్శిటీ ఆడిటోరియం అందంగా అలంకరించబడింది. అందరి విద్యార్థిని విద్యార్థులతో పాటు ఆ. డిపార్ట్‌మెంట్‌కు చెందిన స్టాఫ్ అందరూ వచ్చారు. విందు ముగిసింది. ప్రొఫెసర్ స్పీకర్ సమీపించారు.

"జీవితంలో అతి అందమయినది, ముఖ్యమయినది, మరపురానిది, బాధ లేనిది విద్యార్థి జీవితం. ఇంతవరకు బాధ లనేవి లేకుండా ఆనందంగా గడిపారు జీవితాన్ని. అటువంటి అందాల జీవితం ముగిసి బాధ్యత తెలిసిన పౌరులుగా రంగుల కలల నించి నిజజీవితంలోకి అడుగు పెడుతున్న మీ అందరి జీవితాలు ఇంత కంటె ఆనందంగా నడవాలని, మీలో ప్రతి ఒక్కరు మంచి మంచి ఉద్యోగాలలో సెటిల్ అయి గొప్ప వాళ్ళుగా కీర్తిప్రతిష్ఠలతో నిండుగా నూరేళ్ళు నిలవాలనే మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను" తప్పట్లు మ్రోగాయి. మాట్లాడవలసిన వారంతా మాట్లాడారు. పెద్దల దీవెనలు లభించాయి. మరపురాని మధుర జీవితం ముగిసింది.

పరీక్షలు ముగిశాయి. ఆటోగ్రాఫుల్లో సంతకాలు, అడ్రసులు అన్నీ ముగిశాయి. పావని మనసులో ఏదో చెప్పలేని బాధ. ఎందుకో భయం.

"ఏం అదోలా ఉన్నావ్?" రోజి.

"నిన్నొదిలి వెళ్ళాలంటే అదోలా ఉంది."

"నన్నా లేక నీ బాయి ఫ్రండునా?" అదోలా నవ్వింది.

"ఛా నోర్ముయ్."

"పావనీ ఇష్టమున్నా లేకున్నా మనం విడిపోయి మన గమ్యం చేరక తప్పదు. ఇక జీవితం మన అదృష్టం మీద ఆధారపడి ఉంది."

"అదృష్టం. రోజి! వాటి గురించి నమ్ముతావా!? ఆశ్చర్యంగా అంది పావని.

"ఫైనాట్. నేను తప్పకుండా నమ్ముతాను. విధి ఒకటుంది. మనకు తెలియని గొప్ప శక్తి మనల్ని నడిపిస్తుంది. అఫ్‌కోర్సు అది భగవంతుడే కావచ్చు" వింటున్న పావని అదిరిపోయింది.

ఎందుకలా చూస్తావ్?" రోజి.

"భగవంతునిపై నీకు నమ్మకముందా?" పావని అదోలా చూస్తూ అంది.

"ఉంది."

"నిజంగానా!?"

"నమ్మకం లేదా?"

"లేదు."

"ఏం?"

"నీతో గత రెండేళ్ళుగా ఉన్నాను. కనీసం ఒక్కరోజయినా నువ్వు చెయ్యెత్తి నమస్కరించడం చూడలేదు."

"పిచ్చి పావని నీలా నమస్కరించి ఉపవాసాలుంటేనే నమ్మకమున్నట్టా. శుద్ధమయిన మనసుతో ఓ క్షణం ఆయన్ని తలచుకుంటే చాలు. పైకి కన్పించే ఆరాధన అవసరం లేదు."

"అబ్బా చాలా తెలివయిన దానివే."

"సరే వెడ్డింగ్ కార్డు పంపుతావా?" రోజి పావని బుగ్గ లాగుతూ అంది.

"మరి నీ కార్డు" ఈసారి అదోలా చూసింది రోజి.

"దేనికయినా పెట్టి పుట్టాలి."

"అంటే."

"నాకు చాల బాధ్యతలున్నాయి. నా పెళ్ళి కాదు ముఖ్యం. తమ్ముళ్ళు, చెల్లెళ్ళ బాధ్యత స్వీకరించి వాళ్ళందరిని గొప్ప వాళ్ళను చేయటం ముఖ్యం."

"మరి పెళ్ళి."

"పెళ్ళి వద్దనరు. అలా అని మీలా సంబంధాలు చూసి కట్టపెట్టరు. మీలా కులమత భేదాలు లేవు. నాకుగా నేను ఎవర్నయినా ప్రేమించి ఆ వ్యక్తిని మా కుటుంబ సభ్యుల ముందు నిలపాలి. నన్ను ప్రేమించిన వ్యక్తి మా కుటుంబ పెద్దలు చెప్పిన కండిషన్స్‌కు ఒప్పుకోవాలి. చాలా తతంగం."

"ఒప్పుకోకపోతే."

"పెళ్ళి కాదు."

"ఒకవేళ ఒప్పుకుని తరువాత పేచీ పెడితే?"

"డయివర్సు."

"అంటే?" పావని ఆశ్చర్యంగా చూసింది.

"ఇవన్నీ నీకు చెప్పినా అర్థం కావు. కొత్తగా అనిపిస్తాయి. ఏది ఏమయినా మీ పద్ధతులు కట్టుబాట్లంటేనే నాకిష్టం" రోజి పావని చీర సరి చేస్తూ అంది.

"నువ్వూ అలాగే చెయ్యవచ్చుగా."

"పూర్ గాళ్ ఓ. కే. ఇప్పుడవన్నీ దేనికి. ప్రయాణం ఎప్పుడు?"

## కొనకొ! బొమ్మన్






"రేపు. మరి నువ్వు."

"ఈ రోజే."

"ఈ రోజే ఏమిటంత అర్జంటు?"

"వెళ్ళాలి. సరే నన్ను మర్చిపోవుగా? అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూ ఉండు."

"రోజి నిన్ను మర్చిపోవటం అంత సులభమా?"

"ఎంతయినా అదృష్టవంతురాలివి" చిన్నగా నవ్వుతూ అంది రోజి.

"ఏం ఎందుకని?"

"నీ అందానికి అన్ని విధాలా రాణింపు తేగల తెలివైన భర్త నీ చేయి పట్టుకోబోతున్నాడు. మన వింగులో నీలాంటి అదృష్టవంతురాలు మరొకరు ఉండరు" రోజి పావని ముఖం తన వైపు తిప్పుకుంటూ అంది.

"భవిష్యత్తు ఊహిస్తున్నావా? ఎత్తుపల్లాలు అందరి జీవితాల్లోనూ తొంగి చూడక మానవు రోజి."

"నో.....నో అలా అనకు. నీ జీవితంలోకి రావు."

"ఏమిటో గ్యారంటి?"

"ప్లీజ్ మాట్లాడకు" అంతటితో వారి సంభాషణ ఆగిపోయింది. ఆ రోజు నాలుగు గంటల సమయంలో కన్నీటితోనే రోజి వెడలింది. పావనికి దుఃఖం ఆగలేదు.

* * * *

అనుకున్న ప్రకారం ఆరు గంటల సమయంలో పావని బీచి చేరుకుంది. విజయ్ ఆమె కోసమే ఎదురు చూస్తున్నాడు.

"అబ్బా ఇవాళ కూడా లేటే? ఏమిటి ముఖమంతా అలా వుంది. కళ్ళెందుకలా ఎర్రగా వాచాయి." పావని ముఖంలోకి అదోలా చూస్తూ అన్నాడు విజయ్.

"అబ్బే ఏం లేదు. పద అలా వెళ్ళి కూచుందాం" ఇద్దరూ ప్రశాంతంగా ఉన్న ఓ చోట కూర్చున్నారు.

"చెప్పు పావనీ ఎందుకా దిగులు "

"ఏమిటో విజయ్ నిన్ను వదలి వెళ్ళాలంటే బాధగానూ, భయంగానూ వుంది." పావని కన్నుల్లో నీరు నిలిచింది.

"నో..... నో. . ఆ కన్నీరే వద్దు. యింకా ఓ రెండు నెలలు. ఆ తరువాత పెళ్ళి. నేను రోజుకో వుత్తరం రాస్తూనే వుంటాగా" చిరునవ్వుతో అన్నాడు.

"విజయ్ "

"ఏం" కన్నీరు తురుస్తూ అడిగాడు.

"మన పెళ్ళి జరుగుతుందంటావా?"

"యేమిటా పిచ్చి మాట? యెందుకు జరుగదు?"

"నాకేదో భయంగా వుంది."

"అలాంటి భయాలేవీ పెట్టుకోకు. తప్పకుండా మన పెళ్ళి జరిగే తీరుతుంది ధైర్యంగా చెప్పగలను."

"విజయ్" అంటూ అతని ఎదపై వాలింది.

"పావనీ అనవసరంగా నీ మనసు పాడు చేసుకోకు నేను సాధ్యమయినంత త్వరలో మీ యింటికొస్తాను."

"చాలా థాంక్సు. కానీ నిన్ను చూడకుండా వుండలేను విజయ్."

"నేను మాత్రం వుండగలనా? కాని తప్పదు. కొన్నాళ్ళ యెడబాటు తర్వాత కలుసుకొనే కలయికలో చాలా ఆనందం వుంది."

అతని ముఖంలోకి అదోలా చూసింది పావని.

"ప్రయాణం యెప్పుడు?"

"రేపు. మరి నువ్వు?"

"రేపే వుత్తరాలు రాయడం మరచి పోవుగా?" విజయ్ తనపై వాలిన పావన్ని లేవదీస్తూ అన్నాడు

"ఆ ప్రశ్న అడగవలసింది నేను" పావని అతని కన్నులలోకి చూస్తూ అంది.

"సరే చూద్దాం. ఏది నవ్వాలి అందంగా నవ్వాలి" నవ్వింది.

"అబ్బా చాలు. పదా వెళదాం" ఒకరి చేతిలో మరొకరి చేయి వారి ప్రమేయం లేకుండానే ఒకటయ్యాయి.

(ఇంకా ఉంది)

## వ్యక్తిగతం



ప్రముఖ గాంధేయవాది, స్వాతంత్ర్య సమర యోధుడు అయిన డాక్టర్ ఆమంచర్ల శేషాచలపతి రావు అగస్టు 25న గుంటూరులో కాలధర్మం చెందారు. ఈయన వయస్సు 89 సంవత్సరాలు. డాక్టర్ ఆమంచర్ల జాతీయోద్యమంలో, దివ్య జ్ఞాన సమాజం ఉద్యమంలో ప్రముఖపాత్ర నిర్వహించారు 1930, 1942లలో మొత్తం మూడు సంవత్సరాలపాటు కారాగారవాసాన్ని అనుభవించారు. ఈయన తామ్ర పత్ర గ్రహీత. డా ఆమంచర్లకి ముగ్గురు కుమార్తెలు ఉన్నారు. ప్రముఖ మానసిక వైద్య నిపుణులు డాక్టర్ ఎం. శంకరరావు ఆయన సోదరులు ☐



ఎడ్మండ్ థామస్ క్లింట్ నడకకూడా సరిగా రాని వయసులోనే చిత్రకారుడిగా అద్భుతమైన ప్రతిభని ప్రదర్శించిన బాల మేధావి. ఇతను కేరళలోని దేవరకొచ్చిన్‌కి చెందిన జోసెఫ్, చిన్నమ్మ దంపతుల ఏకైక కుమారుడు. మూడు సంవత్సరాల ప్రాయంలో నే ఈ బాలుడికి భారతీయ పురాణాలపై ఇష్టం ఏర్పడి, వాటిలోని పాత్రలని చిత్రాలుగా గీస్తూ ఉండేవాడు. అతనికి గణపతి అంటే ఎంతో అభిమానం ప్రకృతిని కూడా నిశితంగా పరిశీలించి జంతువులు, పక్షుల బొమ్మలని చిత్రించేవాడు. ఈ బాల చిత్రకారుడు భూమిమీద ఉన్న కొద్దికాలంలో నే 20 వేల చిత్రాలకి పైగా గీసాడు. వాటిలో స్కెచ్‌లు, వర్ణచిత్రాలు అనేకం ఉన్నాయి. ఇంత ప్రతిభావంతుమైన ఈ బాలుడికి దురదృష్టవశాత్తు మూడేళ్ల వయస్సులో మూత్ర సంబంధమైన రుగ్మత ఏర్పడింది. ఎన్నో ఆసుపత్రులలో, ఎంతో మంది వైద్యుల దగ్గర చికిత్స చేయించారు కానీ తన ఏడవ పుట్టిన రోజుకి కొద్ది రోజుల ముందు అకాల మృత్యువుపాలైనాడు. అతను గీసిన చిత్రాలే ఇప్పుడతని తల్లిదండ్రులకి కొంతలో కొంత ఓదార్పుని కలిగిస్తున్నాయి .. ☐

# వారఫలం

## 19-9-1986 శుక్రవారం మొదలు 25-9-1986 గురువారం వరకు

★ **మేషం :** ఉత్తమ వారఫలం. గ్రహానుకూలత గల వారం నూతన యత్నాలు వ్యాపార సంబంధంగా యత్నాలు చేసేరుగా! ముందుకు సాగటం మేలే. లాభిస్తుంది. ఉద్యోగరీత్యా అనుకూల వారం ధనాదాయ మున్నది. స్త్రీలకు: సర్వ విధాలా అనుకూలం. విందు వినోదాలు, స్వల్పాదాయం.

★ **వృషభం :** ఉద్యోరీత్యా మేలైన వారం. నూతన వ్యవహారాలలో జోక్యం ఏర్పడుతుంది. విరోధి వర్గంతో జాగ్రత్తగా మెలగ వలసిన వారం. పత్రికా వ్యాసంగం, రచనా విధానంలో, తిరుగాడే వారికి మేలైన వారం. కొందరకు ప్రయాణానుకూలం. స్త్రీలకు: ధన వసతి, ఉద్యోగ వసతి, వ్యవహార వసతి ఏర్పడుతుంది. గ్రహించండి.

★ **మిథునం :** అధికార మందు హెచ్చు. ఆదాయ మందు మెరుగు. ఉద్యోగ మందు కొంత ప్రశాంతత చిక్కుతుంది. పది మందిలో ప్రతిష్ఠ. మాటకు విలువ పెరుగుతుంది. మిత్ర బంధు వర్గంలో ఏదో విధంగా ఘర్షణ రావచ్చు. అలాంటి సూచన గలదు. స్త్రీలకు: ఉద్యోగరీత్యా మేలున్నది. ధనాదాయంలో లోపం లేదు అప్పులుంటే వసూలు కాగలవు గ్రహించండి.

★ **కర్కాటకం :** నూతన వ్యక్తులతో పరిచయం. లావాదేవీ లందు అనుకూలం. కొందరకు సాహిత్య గోష్ఠులందు ప్రవేశం. ఆనందం. సదవకాశాలు. భారీ వ్యాపారం చేసేవారికి, పత్రికారంగానుభవం గల వారికి, పని పాటలు చేసేవారికి, గనులందు పనులు చేసేవారికి అనుకూలం. స్త్రీలకు: సుఖశాంతులు, కుటుంబానందం, స్వల్పంగా ధనలబ్ధి.

★ **సింహం :** ఇటీవల "యింత మంచి వారం లేదు గదా!" అనుకొంటారు సాధు సజ్జన సాంగత్యం అబ్బుతుంది. ప్రయాణాలవల్ల మేలు జరుగుతుంది. వ్యాపారాన అనుకూలం. వృత్తియందు వికాసం. అయినా మతిమరుపు వలన రొక్కమో, వస్తువులో కొందరు పోగొట్టు కొంటారు స్త్రీలకు: కళాసాహితీ రంగానుభవం గల వారికి మేలైన వారం.

★ **కన్య :** సర్వసాధారణంగా మీకు చెడుపు జరుగదు. అన్ని రంగాలలో మేలే. ప్రయాణమూలక లాభమే. స్థిరచరాస్తులందు పెంపు. ఆప్త మిత్రుల వలన సహాయం, వృత్తి యందు ప్రగతి: అంతో యింతో లాభదాయకం, అనుకూలదాయక వారం. స్త్రీలకు: కొందరకు ఉద్యోగరీత్యా ఉన్నత దశ పట్టవచ్చు. చాల మంది ఆరోగ్యం, హాయి, ఆనందం, విందు వినోదాలు.

★ **తుల :** చాల మందికి, ఈ రాశి జాతకులకు అయినవారితో తగాదాలు రానున్నవి. చుట్టు ప్రక్కల గొడవలు ఉండవచ్చు. రాజకీయంగా సుతరాము మేలుగాదు. వ్యాపారం చేసే వారికి "వారఫలం" అనుకూలం గాదు. ఆదాయంలో లోపం. స్త్రీలకు: ఆదాయం సున్న, వ్యయం అధికం, అనారోగ్యత

★ **వృశ్చికం :** నూతన వ్యవహారాలలో తలదూర్చరాదు. ఇప్పటికే యిబ్బందులు అధికమయి ఉంటాయి. వృత్తియందు కూడ అనానుకూలం. అయిన వారిచే మాటలు పడవలసి రావచ్చు. రాజకీయంగా మేలుగాదు. సమయానికి పైకం అందదు, గ్రహించాలి. స్త్రీలకు: ఏ కోణంలో కూడా హాయి లేదు. నిరుత్సాహజనకం. ఆరోగ్యరీత్యా మేలు లేదు.

★ **ధనుస్సు :** నూతన వ్యక్తుల పరిచయం, ఏర్పడుతుంది. అందుమూలాన ఏదో అనుకూలత' ఒకవేళ ధనాదాయం ఉండవచ్చు. వ్యాపారస్తులతో నేస్తమయితే కొంత లాభదాయకమే. విద్యావిషయంగా నిరుత్సాహత ఏర్పడుతుంది. ఆదాయ లోపం. ఉద్యోగరీత్యా కొంత చికాకు, ఓర్పు అవసరం.

★ **మకరం :** శని, గురు గ్రహాల బలమున్నది. ఆదాయ మున్నది. సదవకాశాలు అన్ని రంగాలలోను లభిస్తాయి. వృత్తియందు పెంపు గలవారం. భారీ వ్యాపారం హాయిగా సాగిపోతుంది. నూత్న వ్యక్తుల పరిచయం. అంతో యింతో ఆదాయం. విద్యా విధాన పెంపు. స్త్రీలకు: వృత్తి యందు మెరుగు, శుభకార్యాచరణం.

★ **కుంభం :** చేతిలోని డబ్బుకు చిక్కులు, చిక్కిన అవకాశాలు జారి పోతాయి. గౌరవభాజక ఉద్యోగం మిదయితే చిక్కు లుంటాయి. వృధా కాలక్షేపం చేస్తారు. మంచిదా? వ్యవహారాలున్న వారు సామరస్యంగా పరిష్కరించుకోవటమే మేలు. స్త్రీలకు ఈ వారాన్నుండి జీవిత పథాన నూతనాధ్యాయం ప్రారంభం కాగలదు. గ్రహించండి.

★ **మీనం :** దైవ బలం బాగా పుంజుకోవాలి. ఇంకా కొన్ని వారాలు పట్టవచ్చు. "గురు' గ్రహారాధనచే మేలు పొందుతారు. వృత్తి యందు పెంపు సమకూడుతుంది. ధనాదాయం అభివృద్ధి నందుతుంది. అనుకూలత చేకూరని ఆశలు పెట్టుకోవద్దు. వృధా కాలక్షేపం తగదు. బంధువర్గం యింటికి రావచ్చు స్త్రీలకు. సుఖానందం, ఆదాయ మందు పెంపు. కళారంగాన సదవకాశాలు

— విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి

# ట్రస్ట్

# మీ పళ్లను అనేక విధములుగా సంరక్షిస్తుంది



ట్రస్ట్‌లోని చురుకైన పదార్థములు నోటి దుర్వాసనను దూరము చేసి మీ శ్వాసను తాజాగా ఉంచటమే గాక మీ పళ్ళను శుభ్ర పరచి తెల్లగా మెరిసేలా చేస్తాయి.

ట్రస్ట్ పళ్ళపొడిలోని ఫ్లోరైడ్ మీ పళ్ళ మీదఎనామిల్‌ను గట్టి పరచి, మీ పళ్ళను బలంగా ఆరోగ్యంగా ఉండేలా చేస్తుంది. ట్రస్ట్‌లోని నురుగు మీ పళ్ళను శుభ్రపరచి తెల్లగా మెరిసేలా చేస్తుంది.

ట్రస్ట్ లాంగ్ రీచ్ టూత్ బ్రష్ తక్కువ కృషితో మీ పళ్ళను సంపూర్ణముగా శుభ్రపరచును. దీని బ్రిసిల్స్ యొక్క మృదువైన చివర్లు మీ చిగుళ్ళను మర్దన చేసి మీ పళ్ళను శుభ్రముగా మరియు ఆరోగ్యముగా ఉంచును.







AKSHARA/330/TP

ట్రస్ట్
సంపూర్ణ దంత రక్షణ

# లండన్‌లో డా. గూటాల వారితో ఒకరోజు

"ఉద్యమం జాతి పురోభివృద్ధికి ఊపిరి" అన్న ప్రయోగం గతంలో అనేకసార్లు విన్నాను. ఉద్యోగ ధర్మం కాబట్టి ఆసక్తి ఉన్నా ఏ ఉద్యమంతో సన్నిహిత సంబంధం పెట్టుకోలేదు. ఇప్పుడు. ఉద్యోగ విరమణ తరువాత తొలిసారిగా లండన్ వెళ్లడం జరిగింది. అక్కడ డా. గూటాల కృష్ణమూర్తిని కలవడం జరిగింది. "ఎయిటీన్ నైంటీస్ సొసైటీ" అన్న పేరుతో వారు నడిపిస్తున్న ఉద్యమాన్ని గురించి తెలుసుకునే భాగ్యం కలిగింది. తద్వారా ఉద్యమాల ప్రయోజనం ఇది సక్రమంగా నడిస్తే వాటివల్ల జనావళికి కలిగే మేలు గ్రహించడానికి అవకాశం కలిగింది. లార్డులు, లేడీస్, యూనివర్సిటీ ప్రొఫెసర్లు, పేరుపడ్డ కవులు, రచయితలు కృష్ణమూర్తి గారి ఉద్యమంలో సభ్యులుగానూ, సహాయకులుగానూ ఉన్నారు. ఈ ఉద్యమం విశ్వ వ్యాప్తంగా ఉంది. ఇంగ్లీషు మాతృభాషగా ఉన్న అన్ని దేశాల వారూ ఇందులో సభ్యులుగా ఉన్నారు. అంతేకాక జపాన్ వారు కూడా ఉన్నారు.

కృష్ణమూర్తి గారి ఉద్యమం ఈ దేశ చరిత్రలో కేవలం పది సంవత్సరాల కాలానికి మాత్రమే పరిమిత మయింది. 1890 నుండి 1900 వరకు. ఆ పది సంవత్సరాలలో ను ఈ దేశంలో పుట్టిన ఊహలు, ఆలోచనలు, జరిగిన ఘట్టాలు రచనలూ ప్రపంచ రూపు రేఖల్ని, సరిహద్దుల్ని మార్చగలిగేయని సర్వమానవ పురోభివృద్ధికి అవసరమైన బీజాలు ఆదశాబ్దంలో నే నాటడం జరిగిందని రుజువు చేయడం, ఆ వివరాలన్నిటినీ, వాటికి కారణ భూతులైన వారి నందర్ని చరిత్ర పుటల్లోకి చేర్పించాలన్నదే కృష్ణమూర్తి గారి ఉద్యమం ప్రధాన లక్ష్యం. సరోజినినాయుడు, మన్మోహన్ ఘోష్ (అరవింద మహర్షులవారి సోదరుడు) శరత్ కుమార్ ఘోష్ వంటి భారతీయులు కూడా ఆ నాడు యధాశక్తి కృషి చేసిన వారేనట!

ఆ రోజు శనివారం 14-6-1986 మా అబ్బాయి డా. శ్యామలరావుకి కూడా ఖాళీ గత పన్నెండు ఏళ్ళుగా ఇంగ్లండులో ఉంటున్న మా అబ్బాయికి కృష్ణమూర్తి గారితో బాగా పరిచయం. కృష్ణమూర్తిగారు మా అబ్బాయికి ఫోనులో అమెరికా నుండి ఎవరో వచ్చారు. వారు తమ మిత్రులనీ, వారినీ తీసుకుని "కెన్సల్ గ్రేవ్ సిమెట్రి"కి వెడదాం రమ్మని చెప్పారు. 15 మైళ్ళ దూరంలో బ్రోమ్లీలో ఉన్న మా అబ్బాయి స్వగృహం నుంచి లండన్ లోని కృష్ణమూర్తి గారింటికి సకుటుంబముగా చేరుకునే సరికి సరిగ్గా ఉదయం 10 గంటలయింది. కృష్ణమూర్తి గారు, వారి అతిథిగా ఉంటున్న డా. పసుమర్తి సత్యమూర్తి గారు ఎఫ్. ఆర్. సి. ఎస్. మమ్మల్ని లోనికి ఆప్యాయంగా ఆహ్వానించారు.

ఏవో కుశల ప్రశ్నలతో మా సంభాషణ మొదలయింది. నా చూపులు మాత్రం వారి



లియోనెల్ జాన్సన్ సమాధి వద్ద ప్రొఫెసర్ జేమ్సు జి. నెల్సన్, డా. జి. కృష్ణమూర్తి

ఇంట్లోని పుస్తకాల మీదే ఉన్నాయి. వీటి గురించి ఎంత ఖర్చయి ఉంటుంది! యివి చదివి ఆకళింపు చేసుకోవడం సాధ్యమా!. అన్నది నా ఆలోచన. వారి ఓపికకు, పడ్డ శ్రమకు నా జోహార్లు. ప్రొఫెసర్ జేమ్సు నెల్సన్ వచ్చారు. నైంటీస్ దశాబ్దంమీద కృష్ణమూర్తి గారికి మక్కువ కలిగించడానికి తన పరిశోధనల ఫలితంగా ప్రపంచం చేత ముక్కుమీద వేలు వేయించడానికి ఫ్రాన్సిస్ థామ్సన్ కవే కారణం అంటారు కృష్ణమూర్తి గారు. ఈయన మీద పరిశోధనల కోసమే ఆదిలో కృష్ణమూర్తి గారు ఇంగ్లాండు రావడం జరిగింది. ఆయన సంపాదించిన డాక్టరేటు ఫ్రాన్సిస్ థామ్సన్ పరిశోధనల ఫలితమే! ఫ్రాన్సిస్ థామ్సన్ గారి సమాధిని చూడాలన్న తృష్ణతో నేను ప్రయాణం అయ్యాను డా. పసుమర్తితో సహా.

ఆసిమెట్రీ సుమారు రెండు, మూడు వందల ఎకరాల స్థలం ఉండొచ్చు. వందల కొద్దీ సంవత్సరాలనుంచి వేలాది మందికి శాశ్వత విశ్రాంతి నిలయంఅది. చాలా చోట్ల బాగా గడ్డి పెరిగి ఉంది. పూర్వంలో కృష్ణమూర్తి గారు అక్కడికి వెళ్లి పుష్పగుచ్ఛాలు థామ్సన్ సమాధికి సమర్పించే వారట. కానీ పది సంవత్సరాల నుంచి అటువైపు వీరు వెళ్ళలేదట. క్షణంలో చేరుకోవాల్సిన థామ్సన్ సమాధిని పట్టుకోవడానికి .మాకు గంటకి పైనే పట్టింది. ఆ సమాధి కనిపించకుండా దానికి ముందుగా అనుకుని మరి ఒక సమాధి వెలసింది. పైగా రెండు, మూడు అడుగుల ఎత్తున గడ్డి చుట్టూరా మొలిచి ఉంది. ఆ గడ్డి స్వయంగా కృష్ణమూర్తి గారు, నెల్సన్ గారు ఊత పెరకడం వల్ల మా కందరికి థామ్సన్ సమాధి చూసే భాగ్యం కలిగింది. సమాధి ఎదుట ఫలకం మీద 1859-1907 ఫ్రాన్సిస్ థామ్సన్ "లుక్ ఫర్ మి ఇన్‌ద నర్సరీస్ ఆఫ్ హెవెన్" అని చెక్కబడి ఉంది. ఆ మాటలు ఆయన

ఫ్రాన్సిస్ థామ్సన్ సమాధి దగ్గర డా. పి. ఎస్. ఎన్. మూర్తి, వ్యాస రచయిత డా. కాదంబరి వెంకటరత్నం. డా. జి. కృష్ణమూర్తి, ప్రొఫెసర్. జేమ్సు జి. నెల్సన్ గారు.



కవితలో చివరి పదమట.

ఫ్రాన్సిస్ థామ్సన్ గారి ఆత్మ శాంతికి మేమంతా కొద్ది సేపు ప్రార్థించేక ఫోటో లు తీయడం జరిగింది.

ఆ తర్వాత థామ్సన్ సమ కాలీనుడు, మరో కవి అయిన 'లైనల్ జాన్సన్' సమాధి చూసాం. ఈయన ప్రపంచ ప్రఖ్యాత కవి. ప్రత్యేకంగా భారత దేశానికి మిత్రుడు అయిన 'విలియం బట్లర్ ఏట్సు'కి ఈ లైనల్ జాన్సన్ గొప్ప స్నేహితుడు. ఫ్రాన్సిస్ థామ్సన్ లాగే ఈయన కూడా బ్రహ్మచారేనట. ఈయన మేనకోడలే ఒలీవియా షేక్స్‌పియర్. అదే దశాబ్దంలో చక్కని నవలలు రాసి మంచి పేరు తెచ్చుకున్న మహిళ ఈమె. ఆమె అల్లుడే "ఎజ్రాపౌండు" ఇతనే 'ఇమేజిస్టు' పొయిట్రీకి సృష్టికర్త, నవ కవితకు రథసారథకుడు. తెలుగు భాషకీ, తెలుగు సాహిత్యానికి ఎన లేని సేవ చేసి చరితార్థుడయిన సి. పి. బ్రౌన్ దొర సమాధి కూడా ఈ కెన్సల్ గ్రేవ్ సిమెట్రీలో నే ఉంది. తిరుగు ప్రయాణంలో ఏలిస్ మేనెల్ సమాధి, టి. సి. ఓకానర్ సమాధులు చూసాము.

కృష్ణమూర్తి గారిలో ఛలోక్తి ఉన్నది. సున్నితమైన హాస్యం ఉన్నది. పదాల్ని భావాల్ని పదును పెట్టి తేలిక చేసే ఏదో ఆయుధం ఉన్నది. తెలుసునన్న ఆడంబరం లేదు. డాబూ దర్పాలు లేవు. ఎదుట వ్యక్తి శారీరక, మానసిక కొలతలకి సరి సమానంగా తూగుతూ ఉంటారు. నాలుగు సంవత్సరాలు వయస్సు గల నా మనుమనితో మాట్లాడుతున్నప్పుడు ఇంకా ఓనమాలు దిద్దుకుంటున్న దశలో నే ఉన్న వామన మూర్తిలా కనిపించారు. ప్రొఫెసర్ నెల్సన్ గారితో మాట్లాడేటప్పుడు ఆ ప్రొఫెసర్‌కి, ప్రొఫెసర్‌గా కనిపించారు. నాతో మాట్లాడుతున్నప్పుడు నా వయస్సు గల వృద్ధునిలా కనిపించారు. ఇంకో చిత్రమేమిటంటే కదిలించే వరకు సామాన్యుడి దృష్టిని కూడా ఆకర్షించని అతి సామాన్యుడిలా కన్పిస్తారు. యింతలో ప్రఖ్యాత గాయని, నటి ఇంగ్లండులో స్థిర నివాస మేర్పరుచుకున్న టంగుటూరి సూర్యకుమారి నుంచి కృష్ణమూర్తి గారికి ఫోను. సారాంశం కృష్ణమూర్తి గారికి ఆరోగ్యం ఎట్లా ఉన్నది, ఏదన్నా సాయం అవసరమా? అని. అవసరం లేదని కృష్ణమూర్తి గారి జవాబు.

అప్పటికే బాగా ప్రొద్దుపోయింది. కృష్ణమూర్తి గారికి, డా. పసుమర్తి గారికి టా- టా చెప్పి మేమంతా యింటి ముఖం పట్టాం.

కృష్ణమూర్తి గారి మీద నాకు ప్రత్యేకమైన అభిమానం కలగడానికి గల కారణాలలో ఒకటి ఆయన మా కోన సీమ అమలాపురం కాలేజీలో ఆంగ్లోపన్యాసకునిగా జీవితం ప్రారంభించడం.

నేను ఆయన గొప్పతనాన్ని గ్రహించినంత వరకు పొందిన ఆనందాన్ని అందరికీ పంచుదామన్న కుతూహలమే ఈ రచనకు మూల కారణం.

వ్యాసం, ఫోటో లు
–కాదంబరి వెంకటరత్నం

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగా వుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరించబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతవేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

# విడిన వేకువ

గిరిజా శ్రీనారాయణ్

"అది అమెరికాలోని ముఖ్యపట్టణాల్లో ఒకటైన చికాగో నగరం. సమయం రాత్రి పదిన్నర కావస్తున్నది. గగనసీమల్ని తాకుతున్న భవనాల్లో దీపాలు ఒక్కొక్కటే ఆరిపోతున్నాయి. వెడల్పాటి రోడ్ల మీద రోల్సు రాయిస్, మెర్సిడిస్, కాంటిస్సా కార్లు వరసల్లో చీమల్లా వెళుతున్నాయి. రోడ్లకిరువైపులా ఉన్న మెర్క్యురిక్ నియాన్ దీపాలు నిండు పున్నమి వెన్నెలను మ్రింగేసేలా వెలుగుతున్నాయి. ఆ రాత్రి చలి బాగా ఉంది. ఆ నెలలో చికాగోలో చలి అమితంగా ఉంటుంది. రాత్రి ఉష్ణోగ్రత సున్నా డిగ్రీల క్రిందికి వెళ్ళినా ఆశ్చర్యపడవల్సిన పనిలేదు.

అన్ని భవంతుల కిటికీ తలుపులు మూసుకొని ఉన్నాయి. కానీ స్ట్రీట్ నెంబర్లు నైన్‌లోని సెకండ్ ఫ్లోర్ భవనం కిటికీ తల్పులు మాత్రం యింకా తెర్చుకొనే ఉన్నాయి.

కిటికీ దగ్గరికి రివాల్వింగ్ కుర్చీ లాక్కొని అందులో కూర్చుని ఒంటరిగా రోడ్డు మీదకి తదేకంగా చూస్తున్నది శిల్పాదేవి. ఆ నిరీక్షణలో ఏవేవో గత స్మృతులు ఆవిడ మెదడులో తళుక్కున మెరిసి మాయమవుతున్నాయి. క్రీనీడల్లా ఏవో భయాలు, ఆందోళనలు ఆవిడ మనోఫలకంపై వ్రాలి చికాకును కల్గిస్తున్నాయి. మనస్సులోని అశాంతికి చిహ్నంగా అటూ యిటూ కదులుతూ అసహనంగా ఉంది శిల్పాదేవి. ఆవిడలోని అసహనం క్షణం క్షణానికి పెరిగిపోతున్నది. దీనికంతకీ కారణం శిల్పాదేవి ఏకైక కూతురు మృదుల యింకా యింటికి రాకపోవడమే.

చూడడానికి ఎంతో అందంగా పాలరాతి శిల్పంలా కన్పించే మృదులకు యింకా పదహారేళ్ళు నిండలేదు. వయస్సు తెచ్చిన వంపుసొంపులతో వింత శోభను సంతరించుకొన్న మృదుల ఒక్కగానొక్క కూతురుగా గారాబంగా పెరగటంతో పెంకి ఘటంగా తయారయింది. అన్నింటికీ మించి పదేళ్ళ ప్రాయం దాటగానే స్వేచ్ఛనిచ్చి, విచ్చలవిడితనాన్ని పరోక్షంగా ప్రోత్సహించే అమెరికన్ సంస్కృతి మృదులపై తన ప్రభావం చూపటం మొదలు పెట్టి చాలా కాలమయింది. వయస్సులో చిన్నదైనా, నిర్లక్ష్యంతో కూడిన అహంకారం ఎక్కువ కావడం వల్ల మృదులతో మాటల్లో తలపడాలంటే ముందు కొంత రిహార్సలు వేసుకొంటే కాని సాధ్యపడదు ఎవ్వరికైనా.



"అయినాసరే. ఆ రోజు తను మృదులతో తలపడ్డానికే నిశ్చయించుకొంది. క్రమశిక్షణ లోపిస్తున్న మృదులను సరైన సమయంలో హెచ్చరించకపోతే త్వరలో పశ్చాత్తాప్పడి ప్రయోజనం లేదని తన అభిప్రాయం!! అలా ఎంత సేపు, ఆలోచనల్లో గడిపిందో కాని యింటి ముందు జాపానీస్ పోలో కారు ఆగటంతో ఈ లోకంలోకి వచ్చింది ఆమె.

కారులోంచి మృదుల బయటికొచ్చి కారు లోపల తనికి "థేంక్ యూ" చెప్పి బోగెన్ విల్లియా తీగెలతో ఆర్చిలాగా ఏర్పడ్డ కాంపౌండు గేటు తెర్చుకొని లోపలికి క్షణంలో ప్రవేశించింది.

వెనీషియన్ బ్లైండ్స్ క్రిందికి లాగి, కిటికీ మూసేసి, కుర్చీలోంచి లేచి, తలుపు తీయటానికి తలుపు వైపు కాస్త గంభీర వదనంతో నడ్చింది శిల్పాదేవి.

తలుపు తీయటంతోనే, ఆసరికే లిఫ్ట్‌లో పైకి వచ్చిన మృదుల "హాయ్ మామ్" అంటూ లోపలికొచ్చి చేతిలోని వేనిటీ బ్యాగ్‌ను సోఫాలోకి విసిరేసి దాంట్లో కూలబడిపోయింది.

బాబ్డ్ హెయిర్ చిందర వందరగా రేగి పోయి, టక్‌లో ఉన్న జీన్స్ పేంటు షర్టు బాగా నలిగి పోయి, ఎఱ్ఱబడ్డ కళ్ళతో మృదుల వాడిన గులాబిలా, నలిగిన మొగలి రేకులా ఉంది శిల్పాదేవి కళ్ళకు.

ఒక్కసారిగా తనలోని ఆవేశం అంతా పెల్లుబికి పైకి వచ్చినా ఎందుకో తనను తాను తమాయించుకొంది.

ఓసారి మృదులను ఆపాద మస్తకం పరీక్షించి "గీజర్ యిప్పుడే ఆఫ్ చేసాను నీళ్ళు బాగా వేడిగా ఉన్నాయి స్నానం చేసిరా. భోంచేద్దువుగాని" అంది శిల్పాదేవి. మాతృ వాత్సల్యాన్ని తాత్కాలికంగా కల్గిన ఆవేశం కప్ప లేక పోయింది ఆమెలో.

"ఓహ్..... బాత్.... యిప్పుడు ఓపిక లేదు మామ్" అంటూ నీరసంగా మూల్గింది మృదుల.

"మృదూ.... చెప్పింది విను. లేచి వెళ్ళు" కొరకొర చూసింది శిల్పాదేవి.

"నువ్వెప్పుడూ యింతే మామ్. అన్నింటికీ ఫోర్స్ చేస్తావు" అంటూ విసవిసా తన రూమ్‌లోకి వెళ్ళి పోయింది మృదుల.

"పిచ్చి పిల్ల....." అని తన మనస్సులో అనుకొని వెళుతున్న మృదుల వైపోసారి చూపు సారించి, డైనింగ్ టేబిల్ వైపు అరేంజ్‌మెంట్స్ చేయడానికి కదిలింది శిల్పాదేవి.

యింతలో మృదుల గదిలోంచి పాప్ మ్యూజిక్ విన్పడటంతో చిరెత్తుకొచ్చి అటు వైపుకు నడక మళ్ళించింది.

మృదులకు ఎల్విస్ ప్రెస్లీ, కెంగ్‌లాగిన్స్, టీనాటర్నర్‌ల మ్యూజిక్ సాంగ్స్ అంటే చాలా యిష్టం. మృదుల గదిలోకి తొంగి చూసి అక్కడ

కన్పడ్డ దృశ్యానికి నిశ్చేష్ఠురాలైంది శిల్పాదేవి.

మృదుల స్టీరియోలో వినిపిస్తున్న మ్యూజిక్‌కు అనుగుణంగా డాన్స్ చేస్తూ మెలికలు తిరిగి పోతూ అతికష్టం మీద నేలకి నిలద్రొక్కుంటూ ఒక్కొక్కటిగా వంటిపై గుడ్డలు విప్పేస్తున్నది. మృదుల అలా ఎగరటం శిల్పాదేవికెంతో జుగుప్స, అసహ్యంకల్గించాయి.

గబగబ లోపలికి నడిచి స్టీరియో స్విచ్ ఆఫ్ చేసింది తను.

స్టీరియో స్విచ్ ఆఫ్ చేశాక ఎంతో సేపటికి గాని మ్యూజిక్ పారవశ్యంతో తేలిపోతున్న మృదుల కి విషయం తెలీలేదు. మృదుల కావిషయం తెల్సేటప్పటికి, శిల్పాదేవి అక్కడ్నించి వెళ్ళిపోయింది కూడ. అది ఎవరిపనో మృదులకు వెంటనే అర్థమయింది. "మామ్ ఎప్పుడూ యింతే" అని నసుక్కుంటూ టవల్ పట్టుకొని బాత్ రూములోకి నడిచింది.మృదుల.

మృదుల బాత్ చేస్తున్నంత సేపూ టీనా టర్నర్ మ్యూజిక్‌ను సన్నగా ట్యూన్ చేస్తూనే స్నానం చేసింది.

* * *

భోంచేసిన చేతులు కడుక్కొని, నేప్‌కిన్‌తో చేతులు తుడ్చుకొంటూ డైనింగ్ టేబిల్ దాటి ప్రక్కన కిటికీలో తాను ప్రొద్దున వదిలేసిన సర్ వాల్టర్ స్కాట్ నవల "ది పైరేట్" ను అందుకొని "గుడ్‌నైట్ మామ్" అంటూ బెడ్‌రూమ్ వైపుకు అడుగులు వేయబోయింది మృదుల.

"స్టాప్ మృదూ.... స్టాప్.... నీతో ఒక్షణం మాట్లాడాలి" అజ్ఞాపిస్తున్నట్లుంది ఆమె కంఠం.

"నో.... మామ్ యిప్పుడు కాదు. పడుకోవాలి..... ప్లీజ్".

"నో.... నీతో మాట్లాడి తీరాలి".

"ఏమిటి మామ్? అంత అర్జంటా..... ?"

"యస్.... అంత అర్జంటే" నొక్కి పల్కింది శిల్పాదేవి.

"ఎబౌట్ వాట్..... ?"

"ఈ మధ్య మితిమీరుతున్న నీ ప్రవర్తన గూర్చి"

"డోన్ట్ బి సిల్లీ మామ్.... యిప్పుడు నేనేం చేశానని. నువ్వు రానురాను డర్టీ ఆర్థోడాక్స్‌వై పోతున్నావు–"

"షటప్.... చెప్పేది విను....."

"ఏమిటి? త్వరగా చెప్పు.... నేనీ నవల కంప్లీట్ చేయాలి. పడుకోవాలి. అయినా రేపు ప్రొద్దున బ్రేక్‌ఫాస్ట్ టైములో మాట్లాడుకోవచ్చుగా.... నువ్వు అన్నింటికీ యింతే" అంటూ చిందులు వేస్తూ ముఖం మాడ్చుకొని, మూతి మాడ్చుకొని డ్రాయింగ్ రూమ్ వైపు నడిచింది.

మృద్దుల మాటల్లో అంతరార్థం తెలుసుకోలేనిదేమికాదు తను మర్నాటి ప్రొద్దునవరకూ విషయం వాయిదా వేస్తే తనలో ఇప్పుడున్న ఆవేశం చల్లారిపోతుందని మృదులకు బాగా తెల్సు. తనే రోజన్నా సీరియస్‌గా ఉంటే మృదుల యిలానే మాట్లాడుతుంది. తనలో ఆవేశాన్ని చల్లార్చాలని ఎప్పుడూ ప్రయత్నిస్తూనే ఉంటుంది. చాలామటుకు విజయవంతం అవుతుంటుంది కూడ. తనలోని బలహీనతే అది. కాస్త ఆలస్యమైతే తనలోని ఆవేశం మచ్చుకకూడ కన్పించదు. తను చెప్పదల్చుకొంది తన స్మృతి పథంలోంచి పూర్తిగా మాయమవుతుంది. దాన్ని సరైన టైమ్‌లో ఎక్స్‌ప్లాయిట్ చేయటం ఎప్పుడూ మృదులవంతు అవుతూనే ఉంటుంది. నో యివాళ అలా కాకూడదు. తను మృదులకు తెలిని విషయాలు ఎన్నో చెప్పాలి. మృదులను ప్రస్తుతం నడుస్తున్న మార్గంనుంచి మార్చాలి. అది వీలైనంత త్వరగా జరగాలి. అదే తనలోని ఆవేదనకు కారణం. అది అంత బయటి కెళ్ళిపోతే కాని తన మనస్సుకు శాంతి ఉండదు" మరోసారి ధృఢంగా నిశ్చయించుకొంది శిల్పాదేవి.

"నిన్ను కారులో యింటి ముందు డ్రాప్ చేసిన తనెవరు" సోఫాలో కూర్చుంటూ అడిగింది శిల్పాదేవి.

"డేవిడ్"

"అదే అతనెవరు" అని

"మెట్రో టెలిఫోన్స్‌లో డిజైను యింజనీరు"

"అతనితో నీకు పరిచయం...?"

"సిటీ సెంట్రల్ మ్యూజిక్ క్లబ్‌లో"

"అంటే...మీ పరిచయమెంతవరకూ...?"

"చాలా పరిచయం. డేవిడ్‌కు నాకు యిద్దరికి మ్యూజిక్ అండ్ డాన్స్ అంటే ప్రాణం. యిద్దరం కల్సి డ్రింక్ చేస్తాం. డాన్స్ చేస్తాం. అతనికి నాహాబీస్, అంటే చచ్చేంత లైకింగ్. నాకు డేవిడ్ మానరిజమ్సు నచ్చాయి. అన్నింటికిమించి అతనిలోని మేన్లీనెస్ నాకు చాలానచ్చింది. అందువల్ల యిద్దరం అవుటింగ్, డేటింగ్ చేస్తున్నాం. యిందులో తప్పేముంది?" ప్రశ్నార్థకంగా మొహం పెట్టింది మృదుల.

ఆ క్షణంలో మృదుల ముఖంలోని అమాయకతకు ఏం సమాధానం చెప్పాలో తను వేసిన ఎదురు ప్రశ్నకు ఎక్కడ మొదలుపెడ్తే విషయం మృదులకు భోదపడుతుందో అర్థం కావటంలేదు ఆమెకు. ఆసలా పరిస్థితికి నవ్వాలో ఏడ్వాలో కూడ తెలిని సందిగ్ధత ఆ క్షణంలో.

క్షణంపాటు తల్లి నిరుత్తరురాలవటం ఆశ్చర్యంగా గమనించింది మృదుల "ఏంటి మామ్... అలానా మొహంలోకే చూస్తూ ఉండిపోయావు...?"

"ఏంలేదు మృదూ... నీ వయిస్సెంతో నీకు తెల్సో తెలీదో అని ఓ క్షణం సందేహం వచ్చింది."

"నా వయిసా. సర్‌ప్రైజ్ మమ్మీ... అదేం డౌట్... స్వీట్ సిక్స్‌టీన్"

"యింకా టీన్ ఏజెస్‌లో ఉండగానే ఈ ప్రవర్తన ఏమిటమ్మా... యిదే వయిస్సులో ఉన్న మనదేశం అంటే యిండియాలో అమ్మాయి యింకా తల్లిచాటు బిడ్డగానే ప్రపంచాన్ని అర్థంచేసుకోవాలని



ప్రయత్నిస్తుంది. మరి నీ ప్రవర్తనలో... నీ ప్ర... వ...ర్త...న... లో ఉ(... మాట్లాడ్డానికే నాకు మాటలు రావటంలేదు..." భుజా లెగరేసి నిస్సహాయంగా ఓ పెద్ద నిట్టూర్పుతో ఆగిపోయింది శిల్పాదేవి.

"డోంట్ కంపేర్ మివిత్ బ్లడీ యిండియన్‌యిజమ్... నాకు యిండియా అంటే పరమ బోర్. ఆ ఆర్థోడాక్స్ ట్రెడిషన్స్ అన్నా అవుట్ మోడెడ్ కల్చర్ అన్నా డామ్ యిరిటేటింగ్‌గా ఉంటుంది. ఐ' హేట్ దట్ బ్లడీ ఫ్రీడమ్ లెస్ యిండియన్ వుమెన్ హుడ్... ఎంతో అసహ్యాన్ని వ్యక్తపరుస్తూ చెప్పింది మృదుల.

"నీ అజ్ఞానాన్ని, నీ సూపర్ ఫిషియల్ నాలెడ్జ్‌ను, వెర్రి వె(ర్రిగా యిష్టం వచ్చినట్లు రాసి పారేసే వెస్ట్రన్ క్రిటిసిసమ్‌ను చదివిన అహంకారంలోనూ మన దేశాన్ని బిలిటిల్ చేయకు. ఓకే. ఓకే... యిప్పుడు అసలు విషయానికి వద్దాం.... డేవిడ్‌కు ఎన్నేళ్ళుంటాయి?"...

"మేబి... ఎరౌండ్ థర్టీ"

"అంటే నీ అవుటింగ్‌లకు, డేటింగ్‌లకుసరిసమాన వయిస్కుడు కాకపోయినా నీకు షేమ్ అనిపించటం లేదన్నమాట."

"ఏజ్ యీజ్ నో ప్రాబ్లమ్... మనస్సుకు ప్రేమించటం తెల్సి ఉంటే- అయినా నేను ఎడ్యుకేటెడ్. ఏ ప్రాబ్లమ్‌నైనా యీజీలీ సాల్వ్ చేసుకోగలను యూడోన్ట్‌వర్రీ"

"షటప్... జీవితంలో వచ్చే సమస్యలకు చదువొక్కటుంటే సరిపోదు అనుభవం ఉండాలి... అయినా ట్వెల్త్‌క్లాస్ కూడ చదవనినువ్వు నన్ను ఎడ్యుకేట్ చేయాలని ప్రయత్నించకు. ఈ దేశంలో మ్యూజిక్, డాన్స్ పిచ్చిలోపడి ఎంతమంది జీవితాలు నాశనం చేసుకుంటున్నారో నాకు తెల్సు... నీకేం తెల్సు. ఈ మ్యూజికల్ సెక్స్ సాంగ్స్, క్లబ్ డాన్స్‌లు ఈ దేశం వుమెన్ హుడ్‌ను ఎంతో అప్రతిష్ఠపాలు చేశాయి. వెస్ట్రన్ కంట్రీస్, యూరప్ దేశాలు ఈ

# విడిన తెరలు

మ్యూజిక్ ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నాయి. ఈ దేశాలకు సంప్రదాయ సిద్ధమైన, సంస్కృతి పరమైన సంగీతం లేకపోవటమే ఈ నాశనానికి కారణం. కానీ యిండియా అలాంటిదారి తొక్కలేదు. తెల్సా.... తెల్సా డోంట్‌ఫీల్ హై ఎయిర్ ఆఫ్ యువర్ సెల్ఫ్... బిమైండ్‌ఫుల్ దట్ అయామ్ యువర్ మదర్" బిగ్గరగా అర్చినంత పనిచేసింది శిల్పాదేవి.

"సారిమామ్ నిన్ను హర్ట్ చేయాలని అలా మాట్లాడలేదు. ఏదో అలా ఫ్రీస్టైల్‌లో మాట్లాడటమ్ నా హేబిట్. అంతే" ముఖం చిన్నబుచ్చుకుంది మృదుల.

"ఓకే... ఓకే... కమ్ టుది పాయింట్: డేవిడ్ గతం గురించి నీకు తెల్సిన వివరాలు...?

"డేవిడ్‌కు గతంలో సోనియా అనే యిటాలియన్ వైఫ్ ఉండేది. చచ్చేంత ఆర్థోడాక్సట. మ్యూజిక్, డాన్స్ అంటే ఏమాత్రం యిష్టం ఉండేది కాదుట ఆమెకు. పైగా సెక్స్ విషయంలో కూడ ఫ్రీగా ఉండేదికాదుట. చాలా ప్రైవేసి కోరుకొనేదిట. అదంతగా నచ్చక డేవిడ్ డైవోర్స్ తీసుకొన్నాట్ట ఆమెనుంచి, ఆ తర్వాత చాలాకాలం అంటే నే పరిచయమయ్యేవరకూ లోన్లీగా గడిపేట్ట"

"అంటే నీకు తెల్సిన వివరాలు అంతేనన్నమాట"

"అంటే"

"పూర్‌గర్ల్, ఒకసారి డైవోర్సు తీసుకొన్న మనిషితో జీవితం ప్రారంభించాలన్న ఆలోచన కల్గటం నిజంగా దురదృష్టం... అందునా అమెరికన్ లైఫ్‌లో డైవోర్స్ అంటే ఎంతో సింపుల్‌గా తీసేస్తారో తెల్సిమరి అతన్ని డేటింగ్‌కు ఎంకరేజ్ చేయడం పూర్ రిఫ్లెక్షన్ ఆఫ్ యువర్ ఎక్స్‌పీరియన్స్. ఈ దేశానికి పూర్తిగా భిన్నం యిండియా యిండియాలో డైవోర్సు అనేది హైలీహేటడ్ వర్డ్... యూ. నో. ఈ దేశంలో వుమెన్ ఓ సెక్స్ సింబల్. కానీ యిండియాలో వుమెన్ ఫామిలీ గాడెస్... అండర్ స్టాండ్..."

"మమ్మీ. నీ ఉపన్యాసాలతో నన్ను బోర్‌కొడుతున్నావు. యింకానయం యిండియాలో ఆడవాళ్ళు బ్రతపేడతో గొబ్బెమ్మలుచేసి దేవతలా పూజిస్తారు... "నువ్వు అది నేర్చుకో..." అని సలహా యివ్వలేదు." వ్యంగ్యంగా అంది మృదుల.

"ఒకప్పుడు నేను నీలాగే మాట్లాడేను... చూడమ్మా మృదూ... సందర్భాన్ని బట్టి హాస్యం అయినా, అపహాస్యం అయినా బాగుంటుంది. నీకు యిండియన్ కల్చర్ గురించి తెలీక అలా మాట్లాడుతున్నావు. నీకు యిండియా గురించి అర్థమవ్వాలి అంటే వాల్‌స్ట్రీట్ జర్నల్, వాషింగ్టన్ పోస్ట్ చదివితే ప్రయోజనంలేదు. రాధాకృష్ణన్, చిన్మయానందా, రంగనాధానంద వివేకానంద పేర్లు ఎప్పుడన్నా విన్నావా. అవి చదివాక మాట్లాడితే నీ మాటలకో విలువుంటుంది. ఓకే "ఎఱ్ఱ జీరలు పడ్డ కళ్లతో ఉరిమినట్లు చూసింది శిల్పాదేవి కాసేపు యిద్దరి మధ్య మౌనం చోటు చేసుకుంది.

"తను మమ్మీని అనవసరంగా రెచ్చగొడుతున్నానా" అని ఆలోచించసాగింది మృదుల.

ఓసారి చేతిగడియారం వైపు చూసుకొంది. రాత్రి పదకొండున్నర కావస్తున్నది. చేతిలోని పుస్తకాన్ని ప్రక్కన ఉన్న స్టూల్‌పైపెట్టి ఓసారి ఆలోచించి మమ్మీవైపు చూసింది. మమ్మీముఖం చాలా సీరియస్‌గా ఉంది. దేని గురించో తీవ్రంగా మధన పడుతున్నట్లు అన్పించింది మృదులకు. ఆ సమయంలో మమ్మీని పలకరించాలంటేనే భయంగా ఉంది తనకు. గడియారం వైపు, మమ్మీవైపు మార్చి చూస్తూ కూర్చుంది.

కొద్ది క్షణాలు అలా గడిచాక శిల్పాదేని మృదుల వైపోసారి చూసి మాట్లాడటం ప్రారంభించింది.

"చూడు మృదు... నేనిప్పుడు చెప్పేది శ్రద్ధగా విను. ఎందుకిలా చెప్తున్నానో తెల్సా... నువ్వు, నీ వలన నేను జీవితమనే నౌకలో ఎలాంటి ఎడారుల మధ్య, పెనుగాలులు, తుఫానుల మధ్య ప్రయాణిస్తున్నామో నీకు అర్థమయ్యేందుకు. ఆ తర్వాత కూడ నువ్వు ప్రస్తుతం అనుసరిస్తున్న మార్గాన్నే ఎన్నుకొంటే, అయామ్ రియల్లీ హెల్ప్‌లెస్. గాడ్ ఎలోన్ కెన్ సేవ్‌యు. బిఓపెన్ మైండెడ్..."

"ఏమిటి మమ్మీ అది"

"చెప్తా... విను"

* * *

సీతారామయ్యగారు కుటుంబంతో సహా అమెరికా వచ్చి స్థిరపడటం ఆయన జీవితంలోనే ఊహించని క్రొత్త మలుపు.

జన్మతః ఆంధ్రుడైన సీతారామయ్య బాపట్లలో చదువుకొని ఆంధ్రా యూనివర్సిటీనుంచి కెమికల్ టెక్నాలజీలో డిగ్రీ తీసుకొని హైదరాబాద్‌లో వృత్తి రీత్యా కొన్నేళ్ళు, నేషనల్ జియో ఫిజికల్ రిసెర్చి యిన్‌స్టిట్యూట్‌లో సైంటిస్ట్‌గా పనిచేసి అద్భుతమైన పరిశోధనలు చేశాడు.

కాని, దురదృష్ట మేమిటంటే ఆయన పరిశోధనలకు భారత దేశంలో ఆశించినంత గుర్తింపు లభించలేదు. అయినప్పటికీ అమెరికాలోని ఓ



ప్రైవేటు సంస్థ ఆయన్ని తన కంపెనీకి రీసెర్చి డైరక్టరుగా ఉండమని ఆహ్వానించటంతో అనుకోకుండా వచ్చిన ఆహ్వానానికి ఆయన కుటుంబంలోని వారంతా సంతోషంతో వుబ్బి తబ్బిబ్బు అయ్యారు

ముఖ్యంగా సీతారామయ్య ధర్మపత్ని జానకమ్మ పదహారణాల తెలుగింటి ఆడపడుచు ఆవిడ తన బర్త కొచ్చిన గౌరవం అంతా ముమ్మాటికీ తన జాతకం ప్రబావం వల్లనేనని మురిసిపోయే సగటు స్త్రీమూర్తి

స్త్రీ చిత్తం, పురుషుడి బాగ్యం అన్న సామెతను తూ చ తప్పకుండా విశ్వసించే అమాయిక హృదయం ఆమెది బర్తకు చేదోడు వాదోడుగా ఉండి ఆయన్ని ఏ విషయంలోనూ నొప్పించకుండా కుటుంబ బారమంతా తను మోస్తుండ బట్టేకదా ఆయన ఆ స్థితికి ఎదగ గల్గిందని తన మనస్సులో ఎప్పుడూ అనుకొంటుండేది

రీసెర్చిలో పూర్తిగా మునిగిపోయిన సీతారామయ్య యింటి విషయాలన్నింటినీ బార్య జానకమ్మ మీదనే వదిలేసేవాడు సీతారామయ్యకు యిద్దరమ్మాయిలు పెద్దది రూప చిన్నది కల్పన పెద్దదాన్ని చంటి అని, చిన్నదాన్ని చిన్న అని ముద్దుగా పిల్చుకొనేవాళ్ళు

రూపకు, కల్పనకు ఏ విషయంలోనూ అబిప్రాయం కుదిరేదికాదు రూప పెంకిగాను, మొండిగాను ప్రవర్తించేది అందుకు బిన్నంగా ఉండేది కల్పన వాళ్ల అభిరుచులు కూడ వేరు వేరు

అమెరికా కొచ్చిన కొద్దికాలంలోనే రూప (చంటి) వెస్ట్రన్ మ్యూజికల్ అన్నా, బాయ్ ప్రెండ్స్ అన్నా ఆసక్తి చూపటం మొదలు పెట్టింది అసలు ఆ, మాటకొస్తే అమెరికన్ సంస్కృతిలో కొత్తవాళ్లను సులువుగా ఆకర్షించేది మ్యూజిక్, క్లబ్బులు ప్రెండ్స్

కల్పనమటుకు మునుపటిలాగానే తల్లికి చేదోడు వాదోడుగా ఉంటూ జానకమ్మకు అన్ని విషయాల్లోను సాయపడేది రోజు రోజుకు చంటికి బయటి తిరుగుళ్ళు ఎక్కువ అవటం మొదలయింది

చంటి వెస్ట్రన్ మ్యూజిక్ పెట్టినప్పుడల్లా, కల్పనకు కంపరమెత్తుకొచ్చేది ఆ మ్యూజిక్ అంటేనే కల్పనకు ఎక్కడలేని ఏవగింపు

ఏయ్ చంటి ఎంటా రణగొణ ధ్వని వడగళ్ళ వానలా, చెవులు చిల్లులు పడేలా ముందు కట్టేయి అని చిన్ని (కల్పన) గొడవ చేసేది

నీకేం తెల్సు ఈ మ్యూజిక్‌లోని వెచ్చదనం నోర్మూసుకో అనేది రూప

ఆఁహఁ నీకు బలే బాగా తెల్సులే మనింట్లో ఉన్న కంచు పాతర సామాగ్రిని అంతా ఓ చోట కుప్పేసి, బాదుతుంటే యింతకంటే బాగుంటుంది ఆ మ్యూజిక్ అయినా యివేం మ్యూజిక్‌లే ఓ వయొలిన్ కాదు ఓ వీణ కాదు ఓ సితార కాదు కనీసం కుండ తబలా, సన్నాయి వాయిద్యం కూడ కాదు ఉరుములు ఉరిమినట్లు, కంచు సామాగ్రి

# విడిన తెరలు

అటక మీద నుంచి క్రింద పడ్డట్టు ఒకటే గోల అని విసుక్కునేది చిన్ని వాళ్ళిద్దరి మధ్య తగవు తీర్చలేక సతమత మయ్యేది జానకమ్మ

అలా అని చంటిని జానకమ్మ విసుక్కోకుండా ఉండేది కాదు తొడలపైకి పల్చటి స్కర్టు, పచ్చని నిగనిగలాడే తొడలు కన్పించేలా లోపల్ల బెత్తెడు డ్రాయరు వేసుకొని దేశమ్మీదికి చంటి తిరగటానికి పోబోతుంటే అవ్వ మన యింటా వంటా లేదు ఈ బోగం వేషాలు అయినా నీకిదేం పోయేకాలం వయస్సొచ్చిన పిల్లవి కల్పనలాగా ఎంచక్కా, చీరె జాకెట్టు కట్టుకోకుండా యిదేం పిదప కాలం బుద్ధులంట అని జానకమ్మ విసుక్కొనేది

చూడుమమ్మీ ఒక్కొక్క దేశానికి ఒక్కో వేష బాష లుంటాయి బి ఏ రోమన్ వెన్ యు ఆర్ యిన్ రోమ్ అని సామెత ఆంధ్రాలో చీరె జాకెట్టు– అమెరికాలో స్కర్టు, పాంటీస్ ఒకటే అయినా



ఆచారాలు, మర్యాదలు దేశాన్ని బట్టి మారుతాయి ఉదాహరణకు ఆంధ్రాలో అన్నం తినేటప్పుడు గాని తిన్న తర్వాత గాని త్రేన్చితే ఎవ్వరూ సారి చెప్పరు అలాగే దగ్గినా, పది మంది ముఖంపై పడేట్లు తుమ్మినా ఎక్సక్యూజ్‌మి అని నిలువునా చీల్చినా అనరు కాని ఈ దేశంలో బ్రియతేషన్, స్నిజింగ్ అన్నింటికి సారి చెప్తారు మన దేశంలో డ్రైనేజ్‌లేని మురిక్కాల్వలు పెంటలు దోమలు ఎక్కడ పడితే అక్కడ సాక్షాత్కరిస్తాయి రోడ్లపై ఉమ్ములు, బస్సుల్లో కక్కులు అక్కడ మామూలు కానీ యిక్కడ అలాంటివి మచ్చుకకి కూడ కన్పడవు యిదో భూతల స్వర్గం మన దేశం ఓ భూతల నరకం టేక్ ఈజీ మమ్మీ కాలంతో, ప్రాంతంలో మనమూ మారాలి అని గుడ్‌బై చెప్పి వెళ్ళిపోయింది రూప జానకమ్మ రూప మాటకారి తనానికి నోటిపై వేలు వేసుకోవటం తప్ప ఏమి చేయలేక పోయింది

ఓ రోజు చంటి యింటికి రాత్రి రెండు గంటలకు తూలుతూ వచ్చింది చంటికోసం కాచు కూర్చున్న జానకమ్మకు చంటిని ఆ స్థితిలో చూడగానే షాక్ కొట్టినట్లయింది

జడ ఊడిపోయి, జుట్టు చిందర వందర అయి, ఫ్రాక్ నలిగిపోయి బుగ్గలపై గాట్లతో వళ్ళు తెలీని స్థితిలో యింటి కొచ్చిన కూతుర్ని చూడగానే జానకమ్మ మనస్సు యేదో కీడు శంకించింది ఉండబట్టలేక 'ఏంటే చంటి ఈ అవతార మేమిటి? ఏం జరిగింది అంటూ ఆదుర్దాలో పొంగి వచ్చే వేదనని అణిచి పెట్టుకొని మరి అడిగింది

మమ్మీ ఈ రోజు మైఖేల్ తన బర్త్‌డే పార్టీకి పిల్చాడు అక్కడ డ్రింక్స్ తీసుకొమ్మని మైఖేల్, మైఖేల్ స్నేహితులు బలవంతం చేశారు డ్రింక్స్ తీసుకొన్నాను తప్పా మమ్మీ దిసీస్ అమెరికా అయినా డ్రింక్ మాంచి మజాగా ఉందిలే నువ్వు కూడ డ్రింక్ కొట్టు మమ్మీ అంటూ తన రూము వైపు నడిచి అలాగే బెడ్‌పై వాలిపోయింది

జరిగిన దానికి విస్తుపోయింది జానకమ్మ ఈ విషయం తన భర్తకు తెలిస్తే ఆయన సున్నిత హృదయం ఎంత గాయ పడుతుందోనని కలవరం చెందింది ఎలాగోలాగా చంటికి నచ్చ చెప్పి ఈ అలవాటును మార్చాలని అనుకొంది ఆ రాత్రి జానకమ్మకు కంటిపై కునుకు రాలేదు

తెల్లవారక ముందే లేచి చంటి గదికి వెళ్ళింది చంటికి, జానకమ్మకు ఎంతో వాదం జరిగింది కానీ చంటి పెడసరం ముందు జానకమ్మ ప్రయత్నం ఫలించ లేదు

చంటి ప్రవర్తన నానాటికి మారిపోసాగింది రోజూ త్రాగటం, ఆలస్యంగా రావటం మామూలై పోయింది ఒక్కొక్కసారి రాత్రిళ్ళు ప్రెండ్స్ రూముల్లోనే చంటి నిద్రపోయేది

విషయం ఎంత దాచాలనుకొన్న దాగలేదు సీతారామయ్యకు అత్యంత సన్నిహితుడైన స్నేహితుడు జాన్ మాటల్లో చంటి గురించి అన్ని విషయాలు వివరించాడు సీతారామయ్యకు ఆవేశం ఆగింది కాదు ఈ రోజు చంటి, నేను మా యిద్దరిలో ఎవరో ఒక్కరే ఉండాలి అని నిశ్చయించుకొని యింటికి వచ్చాడు

సీతారామయ్య ఉద్రేకం చూసి జానకమ్మ చాలా ఆందోళనకు గురయింది ఏం జరుగుతుందో నన్న బయం ఆవిడ్ని అమితంగా పీడించసాగింది

బగవంతుడా మచ్చలేని ఈ కుటుంబానికి ఎంతటి విషమ పరీక్ష పెట్టావు అంటూ విలవిలాడి పోయింది

చంటికోసం యింటిల్లిపాది పచ్చి మంచినీళ్ళు కూడ త్రాగకుండా అలానే ఉండి పోయారు కాని ఆరాత్రి చంటి యింటికి రాలేదు కనీసం మర్నాడు ప్రొద్దున కూడ రాలేదు చంటి కోసం తన స్నేహితులందరిళ్ళకి ఫోన్‌లు చేశారు కానీ ప్రయోజనం లేకపోయింది

రోజులు, వారాలు, నెలలు గడిచాయి చంటి రాలేదు క్రమంగా చంటి గురించి ఆలోచించటం తగ్గించారు సీతారామయ్య యింట్లో అందరూ

చంటి జ్ఞాపకాలను మనస్సులోంచి తుడిచి వేయసాగారు.

చాలా రోజుల వరకు చంటిఎక్కడుందో వాళ్ళకు తెలీదు. అమెరికన్ నాగరికత వ్యామోహంలో పడ్డ చంటికి అమెరికాలోని స్త్రీ జీవితం పట్ల అవగాహన ఏర్పడేటప్పటికి నెల తప్పి చాలా కాలమయింది.

తను గర్భం తీయించు కోడానికి పెద్ద పెద్ద స్పెషలిస్టులనే కన్సల్టు చేసింది. కానీ డాక్టర్లు ఎవ్వరు అయిదు నెలలు దాటిన గర్భం తీసేయటానికి ముందుకు రాలేదు.

తన బాయ్ ఫ్రెండ్స్ ఎవ్వరూ తనపట్ల యిప్పుడు యిదివరకటి ఆసక్తి చూపటంలేదు. ఎవ్వరూ పుట్టబోయే బిడ్డకు తండ్రిగా ఉండేందుకు అంగికరించటం లేదు. అయినా ఓసారి తనతో అత్యంత సన్నిహితంగా జీవితం గడిపిన మైఖేల్‌ను తన భర్తగా పుట్టబోయే బిడ్డకు తండ్రిగా

జాగ్రత్తగా ఆపసికందు ప్రాణాలని కాపాడు కొంటూ వచ్చారు డాక్టర్లు. తల్లిపాలు లేక పోవటంతో బిడ్డ బ్రతకటం కష్టమయింది.

ఏతల్లైనా ముందుకొచ్చి తన పాలను బిడ్డ కివ్వ గల్గుతుందేమోనని పేపర్లో ప్రకటనలు గూడ చేశారు. కాని డబ్బిస్తే తప్ప తన పాలు యివ్వడానికి ఏ తల్లీ ముందుకు రాలేదు. చివరకు "అమెరికన్ అన్‌వెడ్ మదర్స్ సొసైటీ" వాళ్ళు ఉదారంగా అందించిన సాయంతో బిడ్డకి మరో తల్లిపాలను కొనగల్గారు. ఎలాగో బిడ్డను రక్షించి, తల్లీ బిడ్డను ఆస్పత్రి నుంచి విడుదల చేశారు.

పేపర్లలో ఈ విషయాలు చదివినా సీతారామయ్య హృదయం చంటిని క్షమించలేదు. జానకమ్మ మాతృహృదయం గిల గిలా తన్నుకొన్నా సీతారామయ్యకు నచ్చ చెప్పలేక మిన్నకుండి పోయింది. కల్పనకు మంచి సంబంధం చూసి

ఎంతో నాగరికత పెరిగిన ఈ దేశంలో పెళ్ళి కాని తల్లులు కొన్ని మిలియన్లలో ఉన్నారు. వాళ్ల పిల్లల భవిష్యత్తు ఏమిటి? తల్లి, తండ్రి ప్రేమ, ఆప్యాయత నోచుకోని ఆ పసికందులు మానసికంగా రేపు ఎలా మార్తారో ఊహించగలవా. ఈ పరిస్థితికి ఎవరు భాద్యులు. వయస్సును మించిన స్వేచ్ఛ ఈ దుష్పరిమాణానికి కారణం కాదంటావా..... ఆలోచించు మృదూ ఆ... లో... చిం....చు." యిక మాట్లాడలేక పోయింది శిల్పాదేవి.

శిల్పాదేవి కళ్లు అశ్రుపూరితా లయినాయి. తల్లి చెప్పిన దాంట్లో ఎంతో వాస్తవం కన్పించింది మృదులకు.

క్షణకాలం పాటు జల భరితమైన తల్లి కళ్ళ వైపు చూసి అడిగింది మృదుల "మమ్మి యింతవరకూ నువ్వు చెప్పినది నీకు బాగా తెల్సిన వాళ్ళ గురించా....?" "లేదు మృదూ...... లేదు. ఈ విషయాలు నీకు ఎన్నటికి చెప్పగూడదనుకొన్నా.....

## గడుసులోకం —బాబు







ఉండమని ప్రాధేయ పడింది. అందుకు "నువ్వు చిత్తుగా త్రాగి పడిఉన్నప్పుడు నేను గాక నా ఫ్రెండ్స్ కూడ నిన్ను అనుభవించారు. నీ బిడ్డకు నేనే తండ్రినని ఎలా అంగికరించను" అని ఎదురు ప్రశ్న వేశాడు.

తనో స్థానం పోగొట్టుకొన్న సాధారణ అమెరికన్ స్త్రీ అని గ్రహించటానికి ఎంతో కాలం పట్టలేదు చంటికి. పరిస్థితితో రాజీ పడింది. గుండె ధైర్యం తెచ్చుకొని నైల్స్ పేంట్సు కంపెనీలో రిసెప్షనిస్టుగా చేరింది. నెలలు నిండకముందే నొప్పులు రావటంతో చంటి ఉంటున్న డార్మిటరి యిరుగు పొరుగు ఆమెను ఆస్పత్రిలో చేర్చి తమవంతు భాద్యత నిర్వర్తించారు.

బిడ్డను అతికష్టం మీద తల్లి గర్భం నుంచి బయటికి తీసారు. నెలలు నిండాక ముందే ప్రసవం అవడంతో అమెదగ్గర బిడ్డకు కావల్సిన పాలు లేకుండా పోయాయి. బిడ్డను యింకు బేటర్‌లో పెట్టి

యిండియాలో నే పెళ్ళి జరిపించారు.

సర్వం కోల్పోయి జీవచ్ఛవంలా మారిన రూపకు ఓ భారతీయుడితో పరిచయం కల్గటం ఎడారిలో దాహంతో అలమటిస్తున్న వ్యక్తికి ఒయాసిస్ కన్పించినంత ఆనందాన్ని కల్గించింది. అతను ఓ విమాన ప్రమాదంలో పురుషత్వాన్ని కోల్పోయి వివాహం చేసుకోకుండా ఒంటరిగా జీవితం సాగిస్తున్న దురదృష్ట వంతుడు. అతనామె దీన స్థితి నర్థం చేసికొని రూప బిడ్డకు తండ్రిగా ఆమెకో తోడుగా ఉండటానికి అంగికరించటంతో ఆమె సంతోషానికి అవధులు లేక పోయినయి. ప్రస్తుతం శారీరక వాంఛలకు అతీతంగా, గౌరవమైన ఉద్యోగం చేసుకొంటూ పట్టుదలతో జీవితాన్ని గడిపేస్తున్నది రూప. తన జీవితాన్ని ఆధ్యాత్మికమార్గం వైపుకు మళ్ళించింది.

* * *

"విన్నావా మృదూ..... యింతవరకు నే చెప్పింది. కానీ నీవు నడుస్తున్న మార్గం నాలో రేకెత్తించిన అనేక భయాల వల్ల ఈ రోజు నీకీ విషయాలు చెప్పవల్సి వచ్చింది. రూప (చంటి) ఎవరో కాదమ్మా. ఈ రోజు నీముందు పేరు మార్చుకొని శిల్పాదేవిగా క్రొత్త జీవితం సాగిస్తున్న ఆ అభాగిని నేనేనమ్మా.... కల్పన నా చెల్లెలు "చిన్ని" నీ తండ్రిగా ఈ రోజు నువ్వు అనుకొంటున్న గగన్ విహార్ నిజంగా నీకు ప్రాణం పోసిన తండ్రికాదు. నీకు తండ్రిగా నిల్చి ఈ రోజు మన గౌరవాన్ని నిలబెట్టిన ఓ మానవతామూర్తి, మహామనిషమ్మా గగన్‌విహార్.....

హఠాత్తుగా తల్లి చెప్పిన విషయానికి మృదుల విచలితురాలయింది. తన చెక్కిళ్ల వెంట కన్నీరు కారసాగింది. తిన్నగా లేచి వెళ్ళి తల్లి వొడిలో వొదిగి పోయింది.

అప్పటి దాకా మబ్బుల చాటున దాగిన పున్నమి ఱేడు ఒక్కసారిగా మబ్బుల వెలుపలికి వచ్చి ప్రశాంతంగా వెన్నెల జలతారు కురిపించసాగాడు. □

# గెలవండి! రూ 20,000/-ల విలువైన బహుమతులు!



## కలువబాల

### చందాదారులకు లక్కీడిప్: ఆగస్టు 1 నుండి నవంబరు 1 వరకు.

రు. 60లు చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది. అదిగాక మీరి క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు "చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది

మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా కలువబాల కు ఏడాది "చందాదారులుగా" చేరడమే! కాకపోతే మీ 'చందా' సైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి కలువబాల నుంచి ఒక "చిరుకానుక" కాలక్రమంలో అందుతుంది



కలువబాల
నవ వనితా పక్షపత్రిక

# కలువబాల లక్కీడిప్ చందాదారులకు నిబంధనలు సూచనలు.

1 చందా సైకము రు 60లు మనియార్డరు ద్వారా గాని, డిమాండు డ్రాఫ్టు ద్వారా గాని పంపవచ్చును.
2 ఎమ్ ఒ లు పంపేవారు వారి కూపన్‌తో పాటు, ఎమ్ ఒ పంపిన తేదీ తెలుపుతూ, దాని రశీదు జతచేసి మరీ కూపన్ పంపాలి లేదా డి డి ని కూపన్‌తో జతచేయాలి
3 చందా భారత దేశంలో వున్న వారెవరైనా కట్టవచ్చును
4 చందా సైకము నేరుగా విజయవాడ, ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూడా కట్టవచ్చును
5 ఎమ్ ఒ లు, డి డి లు వ్యక్తుల పేర పంపించకూడదు
6 కూపన్‌లు రిజిస్టర్డు పోస్టులో పంపరాదు లక్కీడిప్ గడువు పూర్తి అయిన తర్వాత యిందులో పాల్గొన్న చందాదారులకు చీట్లుతీసి, పైన తెలిపిన బహుమతులను ప్రకటించుతాము ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు
7 కూపన్‌మీద, మనియార్డరు కూపన్ మీదా కూడా పంపేవారి పేరు, చిరునామా స్పష్టంగా, పూర్తిగా వ్రాయాలి వారు ఇదివరకే చందాదారులైతే కూడా, వారి స్నేహితులెవరికైనా, "కలువబాల" చందాను బహుమతిగా కట్టవచ్చును డి డి లు "ఆంధ్రపత్రిక- విజయవాడ-3" పేర తీసుకొని పంపించాలి

--- కత్తిరించాలి ---



నిజమయితే ✓
కాకపోతే X
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. ( )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు :..............................

.............................................

చిరునామా ·....................................

.............................................

.............................................

ఎమ్ ఒ పంపిన తేది ..............................

లేదా

డి డి జత చేయదమైనది

8. "లక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.
కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా :
కలువబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి.

9. ఈ పథకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము.
గమనిక . ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము.

10 ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌లో పాల్గొనరాదు.

# సీరియల్

# కరిగినశిల

## రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

తెలతెలవారుతూండగా రాజమ్మ ఆరుపు విని తృళ్ళిపడి లేచాడు శీను.

"శీను బాబూ! తొందరగా రా!" చిన్నా గదిలోంచి అరిచింది రాజమ్మ.

ఒక్క అంగలో చిన్నా దగ్గరి కొచ్చి పడ్డాడు శీను.

రాజమ్మ చిన్నా మీద పడి ఏడుస్తోంది. క్షణం అలా నిల్చుండి పోయాడు.

"బాబూ! మనచిన్నా!" నోట్లో కొంగు కుక్కుకుని ఏడుస్తోంది రాజమ్మ.

"చిన్నా!" మెల్లగా తట్టాడు శీను. అతను పలకలేదు.

అతనికింక అన్నగారి పిలుపు కానీ, రాజమ్మ ఏడుపు గానీ వినిపించవు. ఎలాంటి మత్తు మందులకోసం ఆగడం చెయ్యడు. ఎలాంటి అవసరాలు లేనంత దూరానికి, ఎలాంటి బాధలు లేని తీరానికి శాశ్వతంగా తరలి వెళ్ళిపోయాడు.

"అన్నయ్యా!..... ఇంక నిన్ను మందుల కోసం విసిగించను" అన్నట్టు చిరునవ్వులు చిందిస్తున్నట్టుంది అతని మొహం.

"వెళ్ళి పోయావా నాన్నా! ఇంక ఈ అన్నని బాధ పెట్టలేక ఈ కుళ్ళు సమాజంలో ఇమడలేక పారిపోయావా చిన్నా!

స్వార్థంతో నీలో కాలకి నువ్వు వెళ్ళిపోయావే గానీ.... నువ్వు లేని ఈ లోకంలో ఈ అన్న ఒంటరిగా ఎలా బ్రతుకుతాడనుకున్నావురా!.....

పోన్లే! .... నేనెలా వున్నా నువ్వు హాయిగా వున్నావు? "బాధల్నించి శాశ్వతంగా దూరం అయ్యావు. అంతే చాలు" అంటూ పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్న శీనుని చూసేవాళ్ళకి వెన్నులోంచి ఒణుకులాంటిది బయల్దేరింది.

అప్పటికే అక్కడికి చాలా మంది చేరారు.

"ఇప్పుడు చిన్నాని ఏం చెయ్యాలి?" అప్రయత్నంగాపైకే అన్నాడు శీను.

అందరూ భయంగా చూశారతనికేసి. ఏదో ఆలోచిస్తున్న శీను హటాత్తుగా తమ్ముడి శవాన్ని బుజాన వేసుకున్నాడు.

"అదేవిఁటి" అంటూ అడ్డొచ్చిన రాజమ్మని, మరో ఇద్దర్ని విసురుగా తోసేసి

> జరిగినకథ –12: ఆ రాత్రి చదువుతూ ఆపేసిన శీను, చిన్నాల కథని తిరిగి చదవడం మొదలు పెట్టింది సరయు. సాగర్ పన్నిన వలలో చిక్కుకుంటాడు చిన్నా. ప్రాణాపాయ స్థితిలో ఉన్న తమ్ముడు చిన్నాని రక్షించి ఇంటికి తీసుకువస్తాడు శీను. సాగర్ పన్నిన విషవలయంలో చిక్కుకున్న రఘుని గురించి చిన్నాని అడగాలనుకుంటాడు శీను. తూలుతూ ముద్దగా మాట్లాడుతున్న చిన్నాని చూసిన శీను కోపంతో అతనిని వీధి గదిలో పడేసి బైట గొళ్ళెం పెట్టాడు. శీను ఎంతగా కాపలా కాసినా డబ్బు ఎరచూపి ఒక డాక్టరు ద్వారా మార్ఫియా ఇంజక్షన్ తీసుకోసాగాడు చిన్నా.

వీధిలోకి నడిచి పక్కింటి గేటు తీసుకుని లోపలికెళ్ళాడు.

అప్పటికే ఈ వార్త విన్న ఆ ఇంట్లోని వారంతా వరండాలో కొచ్చేశారు.

రక్త వర్ణం దాల్చిన కళ్ళతో, చిందర వందరగా వున్న జుట్టుతో, బుజాన తమ్ముడి శవంతో వున్న శీనుని చూసి కొయ్యబారి పోయారంతా. అతనికి మతి పోయిందనుకున్నారు.

శవాన్ని మెట్ల మీద పడుకోబెట్టి –

"రా డాక్టర్! రా! వచ్చి నా తమ్ముణ్ణి బతికించు. ఎంత డబ్బు కావాలంటే అంత డబ్బిస్తాను. నా తమ్ముణ్ణి తూచ గలిగినంత బంగారం ఇస్తాను...

ఊఁహూ కాదు, నా ఆస్తి మొత్తం రాసిస్తాను. రా! మందు ఇచ్చి నా చిన్నాని బతికించు!

ఏం. ఎందుకంత భయం? .... వీణ్ణి చూస్తుంటే నీకు భయం వేస్తోందా? ఇన్నాళ్ళూ శవాకారంలా వున్న తమ్ముడి దగ్గర్నించి అమానుషంగా డబ్బు, నగలు దోచినప్పుడున్న ధైర్యం ఇప్పుడేమైంది?

నీక్కావల్సింది డబ్బేగా. డబ్బుకోసం ఏగడ్డి కరవమన్నా కరుస్తావుగా? రా!.... నాదగ్గర చాలా డబ్బుంది.... నువ్వు .... నీ వాళ్ళు పది తరాలు కూర్చుని తినేంత డబ్బుంది! అదంతా తీసుకుని నా చిన్నాని బతికించు. లేకపోతే నిన్ను చంపేసి నేను జైలుకెళ్తాను! రా! వచ్చి బతికించు". అంటూ పిచ్చిగా అరుస్తూ డాక్టర్ మీది కెళ్తున్న అతన్ని ఆపడం ఎవరివల్లా కావడం లేదు.

డాక్టర్‌కి ప్రాణాలు పైనే పోయాయి.

విషయం విన్న ఆడవాళ్ళు ఆ డాక్టర్ని దుమ్మెత్తి పోశారు. యువకులు మండి పడ్డారు. పెద్దలు అసహ్యించుకున్నారు.

"వీడు డాక్టరా?" అంటూ అందరూ అతనికేసి ఏహ్యంగా చూశారు.

ప్రాణభయంతో ఒణికి పోతున్నాడు డాక్టర్.

"ఏం? నీ ప్రాణం లాంటిది కాదా నా తమ్ముడి ప్రాణం... ఎందుకంత హడలి ఛస్తావ్?" పగలబడి నవ్వాడు శీను.

"పాపం! మతి పోయింది!" జాలిగా చూశారు చుట్టూ చేరినవారు.

డాక్టర్ మీది కెళ్ళబోతున్న శీను బుజం మీద చెయ్యి పడ్డంతో చివ్వున వెనక్కి తిరిగాడు.

నీరు నిండిన కళ్ళతో అనునయంగా చూస్తున్నారు రాజారావుగారు. ఆయన్ని చూడగానే పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది శీనుకి.

"మావయ్యా! చిన్న..... మన చిన్న..... ఈ డాక్టర్!....." ఆయన బుజం మీద వాలి బావురు మన్నాడు. అది చూసి ద్రవించని కళ్ళు లేవు.

"విన్నాన్నాయనా! జరగరాని ఘోరమే జరిగిపోయింది. ఇందులో ఎవర్నని ఏం ప్రయోజనం లేదు. ఎవరితాపత్రయం వాళ్ళది. వాళ్ళు చేసిన పాపాలు వాళ్ళే అనుభవిస్తారు. ముందు ఇంటికి పద! జరగవల్సింది చూడు!" ఆయన కంఠుపాతో అతని కళ్ళు అద్దుతూ అన్నారు రాజారావుగారు.

"అదికాదు మావయ్యా- ఈ డాక్టర్....."

"ఇక్కడ మనం ఏం చెయ్యక్కర్లేదు! ఇక్కడ తప్పించుకున్నా రేపు ఆ లోకంలో తప్పించుకో లేడు! పద!" అతన్ని పొదివి పట్టుకుని ఇంటికి తీసుకొచ్చాడాయన.

కొందరు చిన్నా శవాన్ని కూడా ఇల్లు చేర్చారు.

ఆ తరవాత జరగాల్సిందంతా రాజారావుగారే దగ్గరుండి జరిపించారు.

చిన్నా లైఫ్ సైజ్ ఫోటో పెద్ద పూలమాల ధరించి హాల్లో గోడ మీద వెలిసింది.

పూరివారి పరామర్శలయ్యాయి.

చిన్నా కర్మ కాండలన్నీ ముగిశాయి.

చిన్నా పోయిన పదిహేనో రోజున అతని ఫోటో ముందు నిల్చుని-

రఘుని, రఘుతో పాటు అనేకమంది తమ్ముళ్ళనీ రక్షించి, వారు ఆ స్థితికి రావడానికి, తన ప్రాణానికి ప్రాణమైన చిన్నా చావుకి కారకులైన వాళ్ళందర్నీ పట్టి ప్రభుత్వానికి అప్పజెప్తానని శపథం చేశాడు శీను.

విషయం జానకమ్మకి, సుజాతకీ చెప్పాడు. అతను కోలుకోవడానికి వాళ్ళ సహాయం కూడా కోరాడు-

అనుకున్నట్టే యజ్ఞం ప్రారంభించాడు. రఘుని ఆ వలయంలోంచి తెలివిగా లాగి మారుమూలగా వున్న ఓ నర్సింగ్‌హోమ్‌లో ఎవరికీ తెలియకుండా వాళ్ళ పెద్దలతో సంప్రదించి చేర్పించాడు. అతన్ని చూసుకోడానికి కొందర్ని రహస్యంగా ఏర్పాటు చేశాడు.

కొంతమంది పెద్దలతో రహస్య సమావేశాలు జరిపాడు. వారి సహాయ, సహకారాలు వుంటాయని వారినించి వాగ్దానాలు తీసుకున్నాడు. తాను పనిచేసే సంస్థ నుంచి ఎన్నో సహాయాలు, మరెన్నో సలహాలు తీసుకున్నాడు.

అన్ని ఏర్పాట్లూ రహస్యంగా చేసుకుని అప్పుడు రంగంలోకి దిగాడు.

ఒక వూళ్ళోకి మకాం మార్చాడు. ఒక తాగుబోతులా, తిరుగుబోతులా నటిస్తూ అందర్నీ నమ్మించాడు. అనతికాలంలోనే పాములు నివసించే పుట్టలో ప్రవేశించాడు. ఎన్నో రహస్యాలు తెలుసుకున్నాడు. మరెన్నో విషయాలు సేకరించాడు. ఆ కంపెనీల చాటున జరిగే దారుణాలన్నీ సాక్ష్యాధారాలతో జాగ్రత్త చేశాడు. .

ఎంతమంది యువతీ యువకులు ఆ మారణ హోమంలో ఆహుతి అయ్యారో, మరెంతమంది కానున్నారో, ఎంతమంది ఆ వలయంలోంచి తప్పించుకోవాలని అల్లాడుతున్నారో అన్నీ జాగ్రత్తగా తెలుసుకుని తన రిపోర్ట్‌లో పొందుపరుచుకున్నాడు-

సాహసించినందుకు మొత్తానికి విజయం సాధించాడు. సాగర్‌ని, ఆ కంపెనీలని మూయించడానికి పథకం తయారు చేసుకుని వాళ్ళ పాపాలు బైటపెట్టడానికి సిద్ధంగా వున్నాడు. అంత ఘోర కృత్యాలు జరుగుతున్నాయని ఆ కంపెనీల్లో పనిచేసే వారికి సైతం తెలియకుండా జాగ్రత్తపడిన ఆ సాగర్ తెలివితేటలకి విస్తుపోయాడు.

రేపో, ఎల్లుండో ... ఈ వార్త గుప్పుమంటుంది. నేరస్తులు శిక్ష అనుభవిస్తారు. తనతమ్ముడి చావుకి కారకులైన వార్ని మూయించడం, మిగతావాళ్ళని రక్షించడం జరిగిపోతుంది. తన బాధ్యత నెరవేరుతుంది. తన ప్రతిజ్ఞ నెరవేరుతుంది.

కానీ ... పరయూ! ఇన్ని పనులు పూర్తి చేసినా ఆ శీనుకి మరో గురుతర బాధ్యత మిగిలిపోయింది. ఇన్ని సాహసాలు చేసిన అతను ఒక స్త్రీకి ఇచ్చిన మాట నిలుపుకోలేకపోయాడు..



## కరిగిన శిల

అదేవిఁటో తెలుసా?

తన చరిత్ర తెలుసుకుని కన్నతల్లిలా ఆదరించిన ఇంటి యజమానురాలికిచ్చిన మాట!

ఆమె, తన గుండె నొప్పి గురించి తెలుసుకుని తను ఎంతో కాలం బతకదన్న భయంతో అతన్ని పిల్చి, తన నిస్సహాయత్వం, కూతురి అమాయకత్వం, తమ గతం అంతా వివరించి, తను పోయినా తన బిడ్డని కనిపెట్టి చూడమనీ, ఆమెనో అయ్య చేతిలో పెట్టమనీ కోరింది. అతను -

"అలాగే" అంటూ అభయం ఇచ్చేశాడు.

ఆవిడ హాయిగా కన్నుమూసింది.

అతనే కొడుకై ఆమెకి తల కొరివి పెట్టాడు.

కూతుర్ని చూడమనైతే చెప్పిందిగానీ ఆ కూతురికి అతనంటే పడదన్న సంగతి ఆమె మర్చిపోయింది. తనంటేనే అసహ్యించుకొనే ఆమెతో చనువుగా ఎలా వుండాలో అర్థంకాలేదతనికి.

అయితే తల్లి మరణంతో ఆమెలో కాస్త మార్పొచ్చింది. మాటల్లో మృదుత్వం, సౌమ్యం చోటు చేసుకున్నాయి.

బహుశా నిస్సహాయ స్థితిలో ఆదుకున్నాడన్న కృతజ్ఞత కావచ్చది.

దాదాపు అక్కడ పన్లన్నీ ముగిశాయనుకున్న శీను తన మకాం మార్చివెయ్యాలనుకున్నాడు. ఈ సంగతి ఆమెకి చెప్పి ఇష్టమైతే తనతో పాటు వూరు రమ్మని, లేకపోతే జాగ్రత్తగా వుండమనీ చెప్పాలని ఆమె ఇంట్లోకెళ్లాడు.

కానీ - అనుకున్నదొకటి! జరిగింది మరొకటి! అంతా తారుమారయింది. చిలిపి మనసు చేసిన చిందరవందరకి ఫలితంగా ఆమెచేత మరీ అసహ్యించబడి, ఆమె బాధ్యతల్నించి దూరంగా పారిపోయాడు.

సరయూ! ఆ శ్రీనివాస చక్రవర్తి ఎవరో అర్థమైంది కదూ? ... ఈనాటి రమణే! ...

కానీ సరయూ! ... నేను తాగుబోతుని కాదు, తిరుగుబోతుని కాదు. అనాడు నా దగ్గరికొచ్చింది మా చెల్లెలు సుజాత! నేను అజ్ఞాతంలో వున్నాను కనుక తనూ రహస్యంగానే కలుసుకునేది నన్ను.

నాకున్న ఆత్మీయులు వాళ్లే! అందుకే మీ అమ్మగారు పోయినప్పుడు మీరలా బాధపడుతుంటే చూడలేక మా పిన్నిని, సుజాతనీ పిలిపించాను.

మీ దయనీయ పరిస్థితికి నా మనసెంత కొట్టుకుపోయిందో ఇప్పుడు చెప్పినా నమ్మరు.

అలా అని నేను చేసింది తప్పుకాదని అనను. పరిస్థితులు! ... చెడ్డ రోజులు! ... నా తొందరపాటు! ... అన్నీ కలిశాయి. క్షమించండి. అయిపోయింది! అంతా అయిపోయింది! ఇంక మనం ఏనాటికీ కలవక పోవచ్చు. కానీ మీ అమ్మ గారికిచ్చిన మాట నిలబెట్టుకోలేకపోయానే అన్న బాధ నన్ను చిత్రహింసలు పెడుతోంది.

అందుకే మీ కంటికి కనిపించకపోయినా ఎప్పటికప్పుడు మీ క్షేమ సమాచారాలు కనుక్కుంటూనే వున్నాను. త్వరలో మీరో మంచి వ్యక్తికి అర్ధాంగిగా వెళ్లాలని కోరుకుంటున్నాను. మీకు మీ ఫ్రెండ్ వనజగారి సహాయ, సహకారాలు ఎప్పుడూ వుంటాయని నాకు తెలుసు.

సరయూ! ... మీకేదైనా సహాయం కావాలంటే మా పిన్నిని కలవండి. ఇందులో వాళ్ల యడ్రస్ ఇస్తున్నాను.

నా జీవిత విశేషాలు చెప్పి మీకు విసుగు కలిగించినట్టున్నాను. క్షమించండి. వుంటాను మరి!

మిమ్మల్ని సదా అభిమానించే,
రమణ

సరయు కళ్లనించి నీరు చుక్కలు చుక్కలు రాలి పేపర్ల మీద పడుతున్నాయి. ఆమె మనసంతా భారంగా అయిపోయింది. రమణ పట్ల జాలి, సానుభూతి, అభిమానం కొండలా పెరిగిపోయాయి.

అతని నటనని నిజం అనుకుని ఎంత అసహ్యించుకున్నదీ, అన్నాచెల్లెళ్లని చూసి ... ఎంత అపార్థం చేసుకున్నదీ, మాటలతో, చేతలతో అతన్నెంత గాయపరచిందీ గుర్తొచ్చి సిగ్గుపడింది. బాధపడింది. ఒక్కసారి అతన్ని చూడాలనీ, క్షమార్పణ కోరాలనీ ఎంతగానో అనిపించింది.

కానీ అతను ఎక్కడున్నాడో ఆమెకి తెలియదు. కనీసం యడ్రస్ కూడా తెలియదు.

రమణ రాసిన ఆ కంపెనీలు ఏవిఁటో? ఎక్కడున్నాయో! ఇన్నీ రాసి అది రాయలేదెందుకు? రహస్యమా? అసలు అతను చేసే వుద్యోగం ఏమై వుంటుంది? ...

అలా ఆలోచిస్తూనే నిద్రలోకి జారిపోయింది.

* * * * * *

ఆదివారం ఏడు దాటుతూండగా నిద్ర లేచిన సరయుకి నిన్న సాయంత్రం వనజ ఫోన్ చేసి చెప్పిన విషయం గుర్తొచ్చి కెవ్వుమన్నంత పని చేసింది.

ఆ రోజు పెళ్లికొడుకుని తీసుకొస్తున్నట్టు ఫోన్ చేసింది వనజ.

"మైగాడ్! ఆ సంగతే మర్చిపోయాను. ఈ అవతారంతో అతని కంటబడితే అతని సంగతేమోగాని వనజ మాత్రం చంపేస్తుంది.!" అనుకుని చక చక స్నానాపానాలు ముగించి నీట్‌గా డ్రస్సయింది సరయు. ఇల్లంతా నీట్‌గా సర్ది కాఫీ టిఫిన్లు తయారుచేసి వుంచింది.

కాఫీ ముగించి వంట చేస్తూ ఆలోచనలో పడిపోయింది.

"ఇవాళ నాకు పెళ్లిచూపులు!" అనుకుని సన్నగా నవ్వుకుంది.

"పెళ్లికొడుకెలా వుంటాడో! హిందీ సినిమాలో హీరోలా వుంటాడా? లేక తెలుగు పిక్చర్‌లో విలన్‌లా వుంటాడా? అయినా పెళ్లి చేసుకోని అతన్ని గురించి తనకెందుకు ఇన్ని ఆలోచన్లు ..." మళ్లీ తనలో తానే నవ్వుకుంది సరయు.

పది గంటలు దాటింది గానీ వనజావాళ్లు రాలేదు. "అసలు ఇవాళేనా వస్తానన్నది?" అన్న ఆలోచనలో పడింది.

వంటంతా ముగించి కూనిరాగం తీస్తూ హాల్లోకి రాబోయిన సరయు ఠక్కున ఆగిపోయింది.

అక్కడ కుర్చీలో వనజ, మరో యువకుడు కూర్చుని వున్నారు. వనజ చిరునవ్వులు చిందిస్తూ చూస్తే అతను ముఖానికి పేపర్ అడ్డు పెట్టుకొని మొహమాటంగా ఫీలవుతున్నాడు.

"బహుశా వనజే అతనికలా చెప్పుంటుంది - ఇదెప్పుడూ ఇంతే!" మనసులో నే విసుక్కుని -

"సారీ! నేను చూళ్లేదు! ఎప్పుడొచ్చారు?" అంది మెల్లగా.

పేపర్ చూస్తున్న వ్యక్తి చటుక్కున పేపర్ కింద పడేసి నిల్చున్నాడు.

"నమస్తే!" అని మెల్లగా తలెత్తి అతనికేసి చూసిన సరయు ఉలిక్కిపడింది. అతనూ చూసి తెల్లబోయాడు.

ప్రతిమలా నిల్చుండిపోయింది సరయు.

అతను మాధవ్!

రమణ పదే పదే కారు ఫ్రెండ్, కారు ఫ్రెండ్ అంటూ చెప్పపాడిచిన



వేణుమాధవ్!

"ఇతను ... వనజ మరిదా?" అని సరయు.

"మా సరూ" అంటూ వదిన పదే పదే పొగిడిన సరూ ... తను మెచ్చిన సరయూనా?" అని మాధవ్, నిర్ఘాంతపోయి అలాగే నిల్చుండిపోయారు.

వాళ్ళిద్దర్నీ చూసి తెల్లబోయిన వనజ -

"ఏవిట్రా! ఇద్దరూ అలా అయిపోయారు?" అంది గట్టిగా. ఆమె మాటలకి ఇద్దరూ వాస్తవంలో కొచ్చారు.

"అయామ్ సారీ!" అంది సరయు.

"అయామ్ ఆల్సో సారీ" నవ్వుతూ అన్నాడతను.

"ఏవిట్రా! మీరిద్దరికి ఇంతకు ముందే పరిచయం వుందా?" అనుమానంగా అడిగింది వనజ.

"ఆ!" అంటూ తమ పరిచయం ఎలా అయిందో చెప్పింది సరయు.

అంతా విని పెద్దగా నవ్వేసింది వనజ.

"ఓ! నువ్వేనన్న మాట ఆ హీరోవి!"

"అవును" అన్నట్టు తలూపాడతను.

"ఎక్స్‌క్యూజ్‌మి! మీరు కూర్చుని మాట్లాడుకుంటూండండి! నేనిప్పుడే వస్తాను!" అనేసి లోపలికెళ్ళి కాఫీ టిఫిన్లు తీసుకొచ్చింది సరయు.

అందరూ కబుర్లు చెప్పుకుంటూ కాఫీ, టిఫిన్లు ముగించారు.

మొహం మీదే పట్టుకుని నాలుగు దులుపుతుందేమో అని భయపడిన వనజ, సరయు అతనితో అరమరికలు లేకుండా మాట్లాడ్డంతో హాయిగా వూపిరి తీసుకుంది. మళ్ళీ కాస్త ఆశ చిగురించింది.

టైము పదకొండు, పన్నెండు, ఒంటి గంట దాటిపోయింది.

"ఇవాళ మీరిద్దరూ ఇక్కడే భోంచెయ్యకూడదూ?" అంది సరయు.

"సారీ! ఈసారి తప్పకుండా తింటా! పెద్దమ్మ వంట చేస్తానంది." లేస్తూ అన్నాడు మాధవ్.

"ఒక సారి కూర్చొంత ... ప్లీ" అంది సరయు

మాధవ్ కూర్చున్నాడు.

"చిన్న అనుమానం! ..."

"మీ అనుమానం నాకు తెలుసు!" పక్కున నవ్వాడు మాధవ్.

వనజ చిత్రంగా చూసింది.

"మీ అనుమానం ఏవిటో నాకు తెలుసు.!" మళ్ళీ నవ్వాడు మాధవ్.

"చెప్పండి!" కుతూహలంగా అంది సరయు.

"ఈ వుద్యోగం మీకెలా వచ్చింది? అదేనా?"

"అవును!"

"మీకు అర్హతలున్నాయి వచ్చింది!"

"అంటే ... మీకూ తెలియదన్న మాట!"

"ఇందులో నిగూఢ రహస్యం అంటూ ఏంలేదండి! మీ తెలివితేటల్ని చూసి మాట్లాడకుండా ఇచ్చేశారు!" అన్నాడు మాధవ్ నవ్వుతూనే.

"నా తెలివితేటలు చూశా?" వ్యంగ్యంగా నవ్వింది సరయు.

"అవును!" గంభీరంగా అన్నాడు మాధవ్.

"నా తెలివితేటల్ని ఎప్పుడు చూశారు?"

"ఓ! అదా! ... అయితే వినండి. మీరేదైనా ఇంటర్వ్యూకెళ్లారా?"

"ఒకటేం కర్మ వంద ఇంటర్వ్యూలకెళ్లాను!" గభాల్న అంది సరయు.

"అలాకాదు ... జస్ట్ పది రోజులకి ముందు!"

"వెళ్లాను!"

"ఆ ఇంటర్వ్యూలో మీ వుద్యోగానికి సంబంధించిన ప్రశ్నలేమైనా వేశారా?"

"ఆ! అన్నిటికి నేను సరైన జవాబులు చెప్పాను కూడా!" తీక్షణంగా అంది సరయు.

"మరా జాబ్ మీకెందుకు రాలేదు?"

"ఏంవుంది ఆ పోస్ట్ ఆల్‌రెడీ ఎవరికో ఇచ్చేసుంటారు. తమాషాకి మమ్మల్ని పిల్చి వుంటారు!" నిరసనగా అంది సరయు.

"ఎస్. యువార్ కరెక్ట్! ఆ వుద్యోగం ఓ మినిస్టర్‌గారి బంధువు కోసం

# కరిగిన శిల

కేటాయించారు. అయితే ఆ కమిటీవార్ని మీ తెలివితేటలు ఆకర్షించాయి. అందులో ఓ పెద్దమనిషికి మరీ నచ్చాయి. దాని ఫలితమే మీకీ వుద్యోగం రావడానికి కారణం!" వివరించాడు మాధవ్.

"అంటే? ..."

"ఏముంది. వుద్యోగం మీకే ఇవ్వాలన్న నిర్ణయం జరిగిపోయింది. కానీ మిమ్మల్ని చూడగానే ఏదో అడగాలనిపించింది. తమాషాగా నాలుగు ప్రశ్నలు అడిగారు! ఇంతకీ మిమ్మల్ని మెచ్చిన ఆ పెద్దమనిషి ఎవరో తెలుసా?" నవ్వుతూ అన్నాడు మాధవ్.

"ఎవరు?" కుతూహలంగా అంది సరయు -

"ఆయనే మా అంకుల్! చాలా కంపెనీలకి యజమాని ... చిత్రం ఏవిఁటంటే ఒకసారి చూసి కూడా ఆయన్ని రెండవసారి చూసినప్పుడు గుర్తించకపోవడం!"

"నిజవాఁ?" ఆశ్చర్యపోయింది సరయు.

"అవును! ఇదంతా ఆ రోజే చెప్పారు అంకుల్. ఆయన్ని మీరు గుర్తించక పోయినా ఆయన మిమ్మల్ని గుర్తించారు.

అయినా ఒక్కసారి మిమ్మల్ని చూసినవాళ్ళు ఎవరూ మిమ్మల్ని జీవితంలో మర్చిపోరు!" అదోలా అన్నాడతను.

సరయు చెంపలు ఎందుకో ఎర్రబడ్డాయి.

వనజ కంగారుగా ఇద్దరికేసి చూసి లేచింది.

"నమస్తే! మళ్లీ కలుద్దాం!" అంటూ రెండు చేతులూ జోడించి లేచాడు మాధవ్. వనజ వెళ్లే ముందు ఒంటరిగా సరయుని తీసికెళ్లి -

"సరూ! మాధవ్ చాలా వుత్తముడు! నువ్వంటే ఇష్టపడుతున్నాడు. ఈ అవకాశాన్ని జారవిడుచుకోవద్దు. జాగ్రత్తగా ఆలోచించు!" అంటూ హితబోధ చేసింది.

సరయు మౌనంగా వింటూండిపోయింది.

* * * * * *

"ఏరా మధూ! అమ్మాయెలా వుంది?" అన్నాడు మాధవ్ తండ్రి కాంతారావు.

"బానే వుంది!" సరయు రూపాన్ని తల్చుకుంటూ అన్నాడు మాధవ్.

"ఆ పిల్లని పెళ్లి చేసుకుంటావా?"

"వాడి మొహం చూస్తుంటే తెలియటంలేదూ?" నవ్వింది తల్లి.

"వాడి నోటితో చెప్పనీ! ...ఏరా మధూ. ఆ అమ్మాయిని ..."

"నాకు నచ్చింది!" గభాల్న అన్నాడు మాధవ్. "నచ్చింది సరే! ... పెళ్లి చేసుకుంటావా అని?" వ్యంగ్యంగా అన్నాడు కాంతారావు.

"అంటే మీ వుద్దేశం?" ఎర్రబడ్డ ముఖంతో అన్నాడు మాధవ్.

"నువ్వుండు మధూ! ... నేను చెప్తున్నాను వినండి! పిల్ల కుందనపు బొమ్మలా వుంది. చదువు సంస్కారంగల పిల్ల! సాంప్రదాయం మంచిది! ... ముందు వెనక ఎవరూ లేరు. ఉన్న ఒకే ఒక దిక్కు తల్లి. ఆమె కూడా ఇటీవలే కాలం చేసిందట! అంతెందుకు ఆ పిల్ల మనింటికొస్తే మనింటికే వెలుగు వస్తుంది! రేపు మీరే చూస్తారుగా?" అంది ప్రభావతి ఆనందంగా.

"పాపం! - తల్లి లేని పిల్ల!" అదోలా గొణుక్కున్నాడు మంచంలో వున్న కాంతారావు.

ముఖాలు చూసుకున్నారు తల్లీకొడుకులు.

* * * * * *

ఆ రోజు తెల్లవారుతూనే వెలువడ్డ వార్త విని కంపించి పోయింది సరయు. వూహించని ఆ చేదునిజాన్ని విని ఆమె మనసు తట్టుకోలేక పోయింది.కాఫీ అయినా తాక్కుండా అలా కుర్చీలో కూర్చుండిపోయింది.

ఆమె అలా వుండగానే వీధిలో కారు ఆగిన శబ్దం అయి త్రుళ్లిపడి చూసింది.

వనజ, ఆమె భర్త రామం వస్తూ కనిపించారు. ఆ సమయంలో వారి రాక ఆమెకెంతో ధైర్యాన్నిచ్చింది. గభాల్న లేచి ఎదురెళ్లి వాళ్లని లోపలికి తీసుకొచ్చి కూర్చోపెట్టి -

"వనజా! ఇది విన్నావా?" ఒణుకుతున్న గొంతుతో అంది సరయు.

"ఏదీ ...?" మొహాలు చూసుకున్నారు భార్యాభర్తలు.

"అదే. మా ఆఫీసు ..."

"విన్నాం! అందుకే పరిగెత్తుకొచ్చాం! మీ ఇంటికి ఎవరైనా వచ్చారా?" ఆదుర్దాగా అడిగింది వనజ.

"మా ఇంటికా? మా ఇంటికెవరొస్తారు?" అర్థం కానట్లు చూసింది సరయు.

"పోలీసులుగానీ ...మరెవరైనా గానీ?"

"ఉఁహుఁ! ఏం?"

"ఒకవేళ ఒస్తే రావచ్చు. వాళ్ళు ఎలాంటి ప్రశ్నలడిగినా నిర్భయంగా జవాబు చెప్పండి.

మీరా ఆఫీసులో ఎంతకాలం నించి పనిచేస్తున్నదీ, ఎవరెవరితో ఎంతంత పరిచయం వున్నదీ స్పష్టంగా చెప్పెయ్యండి. మనకి సంబంధం లేనప్పుడు భయపడాల్సిన అవసరంలేదు ... హఠాత్తుగా వాళ్లొచ్చి అడిగితే మీరు కంగారుపడి ఒకదానికి మరొకటి చెప్తారేమోనని కంగారుగా పరిగెత్తుకొచ్చాం!" అన్నాడు రామం.

సరయు ముఖం పాలిపోయింది.

"అదేవిఁటి ... ఆ గొడవల్తో నాకేం సంబంధం?" అంది మెల్లగా.

"మీరా ఆఫీసులో పనిచెయ్యడం చాలు వాళ్ళు మిమ్మల్ని అనుమానించడానికి!" భారంగా అన్నాడు రామం.

"వనజా!" భయంతో సరయు పెదవులు తడారిపోతున్నాయి.

"ఛ! ఛ! అంత భయపడాల్సిందేం లేదు సరూ! వాళ్ళు అనుమానించినంత మాత్రాన మనం దోషులమని కాదు. లే! లే!" అంది వనజ ఆమెకి ధైర్యం చెప్తూ.

సరయు ఇంకా కాఫీ అయినా తాగలేదని గ్రహించి ఆమెని బలవంతంగా లేవదీసి కాఫీ కలిపి తీసుకొచ్చింది వనజ.

ముగ్గురూ కాఫీలు తాగారు.

"సరయూ! ... మరో విషయం!" మెల్లగా అంది వనజ.

"ఏవిఁటి?" అన్నట్టు కంగారుగా చూసింది సరయు.

"ఈ గొడవలో మా మరిది ... అదే మాధవ్‌కి కూడా సంబంధం వుందని ... అరెస్ట్ చేశారు!" లో గొంతుతో అంది వనజ.

"వనజా!" నిర్ఘాంతపోయింది సరయు.

"అవును ... నిజానిజాలు త్వరలో తెలుస్తాయి" అంది వనజ దిగులుగా.

మరి కాస్సేపుండి మరి నాలుగు ధైర్య వచనాలు చెప్పి వెళ్లిపోయారు వనజ, రామం.

నీరసంగా కూలబడిపోయింది సరయు. (ఇంకా ఉంది)

ఇటీవల శ్రీ నాట్య కళానిలయమ్, విజయవాడవారి పంచమ వార్షికోత్సవము సందర్భంగా శత నృత్య ప్రదర్శన ఇచ్చిన కుమారి కె. మంజులకు బహుమతిని అందజేస్తున్న కృష్ణాజిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ వెంకయ్య. ప్రక్కన నాట్యాచార్యుడు శ్రీ జె. వి. శర్మ.



# సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉంది

"తెలిసే చెప్తున్నా. సర్ఫ్ కొనడంలో ఉన్నంత వివేకం మరి దేనిలోనూ లేదు. దీని పవర్ ప్యాక్డ్ ఫార్ములా సామాన్యం కాదు— ఉప్పొంగే శక్తి! మీ డబ్బుకి మించిన విలువ ఇస్తుంది!"

**డబ్బుకి మించిన విలువా? అసలే సర్ఫ్ ఖరీదైనది కూడా కదా?**

"చూడండి! దీని వల్ల ఎంత ఎక్కువ ప్రయోజనమో గ్రహించారా మీరు? కేవలం సర్ఫ్ మాత్రమే నా బట్టల్ని అతి తెల్లగా ఉతుకుతుంది, పైగా వాటిని సంరక్షిస్తుంది. అంచేత అవి కొత్త వాటిలానే కన్పిస్తూంటాయి. అంటే ఎప్పటికప్పుడు అదా— లెక్క కట్టి చూసుకోండి. సర్ఫ్, డబ్బుకి మించిన విలువ ఇస్తుందని అందుకే అన్నాను నేను".

**సరే లలితగారూ, కాని అందుకు సర్ఫ్‌లో ఉన్నది ఏమిటి?**

"ఎంతో ఉంది! ఒక కిలో మామూలు రకం పొడరు ఎంత ఉంటుందో, అంత పొడరు ½ కిలో సర్ఫ్ ప్యాకెట్‌లో ఉంటుంది. అంటే ఒక కిలో మామూలు రకం పొడరు ఉతికేటన్ని బట్టల్ని అర కిలో సర్ఫ్ ఉతుకుతుందన్నమాట. చూశారా, సర్ఫ్ నుంచి మీరు ఎంత విలువ పొందుతున్నారో?"





ఒక కిలో మామూలు రకం పొడరు

½ కిలో సర్ఫ్

**అంటే, ఒక విధంగా, సర్ఫ్ తన ధర తిరిగి చెల్లిస్తుందన్నమాట!**

"ఒక విధంగా ఏమిటి, ఎన్నో విధాలుగా! మనకు లాభమే లాభం. చౌక రకంవి కొనడంలోనూ మంచి నాణ్యమైనది కొనడంలోనూ ఎంతో తేడా ఉంది. అందుకే అంటాన్నేను, సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉందని."




హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తులు

# కధపడింది

## సి.వి. సర్వేశ్వరశర్మ

జోగినాథం ఆనందానికి అంతులేదు. తను రాసిన కథ ప్రచురణకు అంగికరించినట్లు ఉత్తరం వచ్చింది. జోగినాథం సంతోషం చూసి భార్య అలివేలు అప్పుడే విసుక్కోవడం మొదలుపెట్టింది.

'దేనికండి! అంత సంతోషపడిపోతున్నారు' అలివేలు అంటోంది.

'ఎద్దుకేం తెలుసు అటుకుల రుచి, నీకేం తెల్సు' హుషారులో అనేశాడు. అలివేలుకు కోపం వచ్చింది. జోగినాథం అవేం పట్టించుకునే స్థితిలో లేడు.

ఇంటర్ తరగతి చదివేటప్పుడు కాలేజీ మాగ్జయిన్‌కు కథ రాయడంతో కథా రచయితగా తన పెర్సనాలిటీని చూసుకుని ఫీలవ్వడం మొదలుపెట్టాడు.

పాపం ఆ కథ మాగ్జయిన్‌లో ప్రింటుకాలేదు.

ఆ తరువాత సమయం దొరికినప్పుడల్లా కథ రాయడం దానిని ఏదో ఒక పత్రికకు పంపడం మొదలుపెట్టాడు.

అదేం దురదృష్టమో రాత ప్రతి తిరిగి వచ్చేసేది. కొన్ని పత్రికల వారు సమాధానం ఇచ్చేవారు కాదు.

జోగినాథం చదువులో ఫస్టు. అందుకే ఎక్కడా ఆగకుండా చదువు పూర్తి చేసుకుని ఉద్యోగంలో జేరాడు.

పరపతి ఉంటే కథలు పత్రికల్లో పడతాయని స్నేహితులు అన్నారు.

పత్రికలో పరపతి మీద పడిన కథ పాఠకులు చదివి ఛీకొడతారు. అందుచేత ఆ మాట నిజంకాదని జోగినాథం వాదించేవాడు. జోగినాథానికి కథలంటే ఎంత పిచ్చి అంటే పెళ్ళిచూపుల్లో అలివేలును 'మీకు కథలు చదివే అలవాటు ఉందా?' అని అడిగాడు.

ఆమె అదృష్టవశాత్తు 'వీక్లీలో పడ్డ కథలు అప్పుడప్పుడు చదువుతాను' అని చెప్పింది.

పెళ్ళయిన కొత్తలో తను రాసిన కథలు అలివేలును చదవమనేవాడు జోగినాథం. మొదట్లో మొగమాటం తర్వాత వీక్లీలో పడ్డ తర్వాత చదువుతాను అని తప్పించుకునేది.

జోగినాథం ఉద్యోగంలో ఆఫీసరుగా ప్రమోట్ అయ్యాడు. కాని అతని కోరిక తీరలేదు. అలా అని సాధన మానలేదు.

జోగినాథం కొడుకు మల్లిక్ కూతురు చంద్రిక తండ్రి కథా రచన పట్ల తేలిక భావం ఏర్పరచుకున్నారు.

తండ్రిలాగే పిల్లలు చదువులో చురుగ్గా ముందుకు వస్తున్నారు.

మల్లిక్ ఎంత తెలివైనవాడంటే ఇంటర్ పాసవ్వగానే ఇంజనీరింగ్‌లో సీటు ఎంట్రిన్స్ పరీక్ష రాసి సంపాదించాడు.

జోగినాథానికి జీవితంలో చాలా కలసి వచ్చాయి. పిల్లలు ముఖ్యంగా ఆరోగ్యవంతులే గాక మంచి ప్రవర్తనగల బుద్ధిమంతులు.

అలివేలుకు భర్త, పిల్లలు ప్రపంచం. వారి సంతోషం తన సంతోషంగా తీసుకుంటుంది.

అయినా జోగినాథానికి ఒకటే దిగులు. అది తన కథ ఏదో ఒక పత్రికలో అచ్చవ్వాలి.

కథలు ఎలా రాస్తున్నారు? కథల పుస్తకాలు చదివి గ్రహించాలని ప్రయత్నించేవాడు.

దినపత్రికలో ఒక ప్రకటన చూశాడు. కొత్తగా వార పత్రిక మొదలుపెడుతున్నట్లుంది. రచయితల దగ్గరనుండి కథలు ఆహ్వానిస్తున్నట్లు చూశాడు జోగినాథం.

కథా వస్తువు ఆంధ్రుల జీవితానికి సంబంధించినదై ఉండాలి కథా గమనం పాఠకుని చేత చదివించేదిగా ఉండాలి. కొత్త రచయితలకు ప్రోత్సాహం యిచ్చే కొత్త పత్రిక.

జోగినాథం ప్రకటన జాగ్రత్తగా చదివాడు. చాలా జాగ్రత్తగా ఆలోచించాడు. ఈ అవకాశం జారవిడుచుకోకూడదు.

పాఠకులు పట్టు వదలకుండా చదివే విషయం ... ఆలోచించాడు. అదే ... అదే ...

అమ్మాయి - అబ్బాయి ప్రేమ కథ.

ఇదిమామూలు కథే కొత్తదనంలేదు.

అత్తా - కోడలు కథ యువతరానికి ఎక్కదు.

హాస్య కథ - తనకు చేతగాని విషయం.

ఆలోచించాడు రంగారావు హీరో. పెళ్ళయింది. కొత్తగా కాపురం. రుచి మరగిన పులి. రంగారావు భార్య పుట్టింటికి వెళ్ళింది. పనిమనిషి కాంతానికి పెళ్ళికాలేదు. పెళ్ళయితే మొగుడు పొరుగిళ్ళకు పనికి పంపించే సాహసం చేయడు.

కాంతం బాగుంటుంది. చాలా బాగుంటుంది. సరదాగా ఉంటుంది. చూస్తేనే హాయిగా ఉంటుంది. కాంతాన్ని కాసేపు తన భార్య స్థానంలో ఉంచితే రంగారావు వల- కాంతం మూగ బాధ-

అదొక శృంగార కావ్యం.

ఆపైన జీవితమంతా మధుమాసం.

జోగినాథం కథ అయిపోయింది.

ఈ కథ తప్పక ప్రచురిస్తారు.

యథాప్రకారం అలివేలు, కథ చదవలేదు. జోగినాథం కథ పోష్టు చేసేసాడు.

'కథ త్వరలో ప్రచురిస్తాం.' ఉత్తరం వచ్చింది. నలభయి నాలుగేళ్ల జోగినాథం యిరవై ఏళ్ల కుర్రాడిలా సంతోషపడి పోతున్నాడు.

విశాఖలో ఇంజనీరింగు చదువుతున్న కొడుకు మల్లిక్‌కు జోగినాథం ఉత్తరం రాశాడు. తన కథ ఫలానా కొత్త పత్రికలో పడుతోందని.

ఉత్తరం చూసిన మల్లిక్ తండ్రి కోరిక తీరుతున్నందుకు చాలా సంతోషించాడు. తన క్లాస్‌మేట్సు గోపి, జేమ్సు రవిలకు చెప్పాడు.

ఈ శుభసందర్భంలో సినిమా ప్రోగ్రాం వేసుకున్నారు. మల్లిక్ ఖర్చంతా భరించాడు. ఆ సరదా అటువంటిది.

రోజులు దొర్లుతున్నాయి. జోగినాథం ఎదురు చూస్తున్న పత్రిక మార్కెట్లో విడుదల కావటంలేదు. ఫ్రండ్స్ మల్లిక్‌ను అడుగుతున్నారు.

ఇంజనీరింగ్ కాలేజీ హాస్టల్లో జోగినాథం కథ గురించి ప్రచురణ జరగకముందే విపరీతమైన ప్రచారం వచ్చేసింది. మల్లిక్ ఈ విషయం తండ్రికి ఉత్తరం రాశాడు.

జోగినాథం చాలా గొప్పగా ఫీలయిపోయాడు. ఉన్నట్టుండి ఒక రోజున మార్కెట్లో కిళ్లీ కొట్టు ప్రక్కన తాడుమీద తాను ఇన్ని రోజులుగా ఎదురు చూసిన పత్రిక వ్రేలాడుతోంది.

తన్మయత్వంతో ముందుకు వెళ్లాడు. ఆత్రుతగా పత్రిక తిరగేశాడు.

కథ పేరు మార్చాడు.

'ఆట రుచి' - జోగినాథం.

ప్రింటులో ఎంతో బాగుంది. అర్ధనగ్నంగా కాంతం ఆమెతో రంగారావు బొమ్మ పెద్దది గిసి ఉంది.

జోగినాథం దృష్టిలో ఆ బొమ్మ స్థాయి ఎంకి నాయుడుగా ఉంది.

పుస్తకం కొన్నాడు.

అలివేలు చూసింది. పుస్తకంలో కథలు అంతగా బాగాలేవంది. తన కథ పడింది. కాబట్టి అలా అన్పిస్తోందని జోగినాథం భార్యను ఎద్దేవా చేశాడు

మల్లిక్‌కు ఉత్తరం రాశాడు. మల్లిక్ వెంటనే పుస్తకం కొన్నాడు. రవి చదివాడు. గోపీకి చెప్పాడు. గోపి, జేమ్స్ వరుస ఒకరేమిటి హాస్టల్‌లోని వారంతా ఒకరి తరువాత మరొకరు కథ చదివారు.

సీనియర్ స్టూడెంట్సు తరువాత జూనియర్ స్టూడెంట్సు. కథ బాగా సక్సెస్. అందరూ పట్టు వదలకుండా చదివారు. మల్లిక్‌కు చాలా హీరోయిక్‌గా అన్పించింది. తండ్రికి వెంటనే ఉత్తరం రాశాడు.

రెండు రోజులు గడిచింది.

రాత్రి టీ త్రాగి రూంకు వస్తున్నాడు. రవి ఎదురయ్యాడు. రవితో బాటు సీనియర్ స్టూడెంట్ మరొకతను ఉన్నాడు.

రవి పరిచయం చేశాడు. సీనియర్ స్టూడెంట్ పేరు అగ్నిమిత్ర.

# డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి



"ఒక రాధ, ఇద్దరు కృష్ణులు" షూటింగ్‌లో శ్రీదేవి, డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి

తెలుగు సినిమా ప్రేక్షకులను మెప్పించడం చాలా కష్టం అంటూంటారు చాలా మంది. అలా మెప్పించగల్గిన కొద్ది మంది దర్శకులలో ఎ. కోదండరామిరెడ్డి ఒకరన్న విషయం ఎవరికి తెలియనిది కాదు.

"డైరెక్టర్ అన్న తర్వాత అన్ని రకాల చిత్రాలనూ డైరెక్ట్ చేసి తన ప్రతిభను చూపగలగాలి. ఏదో ఒక దానిలో స్పెషలైజ్ చేయాలి– అనే దృక్పథాన్ని ఏర్పరచుకోకూడదు. పౌరాణికం అయినా, జానపదం అయినా, సాంఘికం అయినా, థ్రిల్లర్ అయినా చిత్రం చిత్రమే. దర్శకుడు చూపవలసిన శక్తి అన్ని చిత్రాలలోనూ ఒకటే. అలాగే చిన్న బడ్జెట్ చిత్రం అన్నా, పెద్ద బడ్జెట్ చిత్రం అన్నా– ఒక దానికి తక్కువ శక్తి, మరొకదానికి ఎక్కువ శక్తి వినియోగించాలని ఏమీ ఉండదు. అది ఏ చిత్రమైనా నిర్మాతకు నష్టం ఏర్పడకూడదు. ప్రేక్షకులను బాగా రంజింప జేయాలి. అంతే. ఇదే దర్శకునిగా నేను ఏర్పరచుకున్న ధ్యేయం. అయితే చాలా మంది కోరుకునే చిత్రాలు ఏనోదాత్మకమైనవి, థ్రిల్లింగ్‌గా ఉండేవి. ఈ కథల్లో సెంటిమెంట్ ధోరణిని కల్పగలిగితే, మరింత ఆకట్టుకోడానికి ఆస్కారముంటుంది. అలాగే ఈ చిత్రాల్లో ఎప్పటికప్పుడు కొత్త ధోరణి వస్తూ ఉండాలి ఫైట్స్‌లో గాని, సాంగ్స్‌లో గాని, క్లైమాక్స్‌లో గాని చిత్రీకరణ ఒకే విధానంలో సాగితే ఆ చిత్రం రాణించదు", అంటారీయన.

ఈయన స్వస్థలం నెల్లూరు జిల్లాలోని గంగపట్నం. నెల్లూరు వి. ఆర్. కాలేజిలో పట్టభద్రులు.

ఈయన హైస్కూల్లో చదువుకునే రోజుల్నుంచే సినిమాలు ఎలా రూపొందిస్తారనే విషయం గురించి తెలుసుకుంటూ వచ్చినా అప్పట్లో ఆ రంగం పట్ల అంత ఆసక్తి ఉండేది కాదు నాటకరంగం పట్ల మాత్రం ఎంతో ఉత్సాహం ఉండేది. ఎన్నో నాటకాలలో ప్రధాన పాత్రలు ధరించారు. కొన్నిటికి దర్శకత్వం వహించారు కూడా. ఈయన సినిమా నటుడుగా రాణిస్తాడని ఆశించారు కొందరు మిత్రులు. ప్రవేశించమని ఒత్తిడి చేశారు కూడా. ఐతే, ఎందుకో ఈయన ఆ మార్గంలో ప్రయత్నించ లేదు.

మిత్రుడు డైరెక్టర్ పి. చంద్రశేఖరరెడ్డి ద్వారా డైరెక్టర్ వి. మధుసూదనరావుకు అసిస్టెంట్‌గా "మనుషులు మారాలి" చిత్రంలో సినిమా రంగ ప్రవేశం చేసి, ఆయన వద్దే పదిహేను చిత్రాలకు పని చేశారు. "మనుషులు మారాలి" చిత్రానికి అసోసియేట్ అయిన కె. రాఘవేంద్రరావుతో మైత్రి ఏర్పడింది. రాఘవేంద్రరావు వద్ద మూడు చిత్రాలకు పని చేశారు.

"ఇలాంటి గొప్ప దర్శకుల వద్ద, క్రమశిక్షణ పాటించే పెద్ద సంస్థలలో పని చేయడం నా ప్రగతికి బాగా తోడ్పడ్డాయి", అంటారీయన. పాటల చిత్రీకరణలో ఈయన స్వర్గీయ ఆదుర్తి సుబ్బారావుని కీర్తిస్తారు. ఆయన దగ్గర పని చేయక పోయినా, ఆయనకు ఏకలవ్య శిష్యుడ్ని అంటారు.

మిత్రులు కె. ఎస్. రామారావు ఈయన దక్షత గురించి యు. సూర్యనారాయణబాబుతో చెప్పారు. అలా "సంధ్య" చిత్రానికి తొలిసారిగా దర్శకత్వం వహించే అవకాశం లభించింది.

ఇంతవరకు ఈయన 35 చిత్రాలను డైరెక్ట్ చేశారు.

నటీనటుల కాల్‌షీట్లు దొరకడం కష్టంగా ఉన్న రోజులివి. వాళ్ళు షూటింగ్ స్పాట్‌కి ఎప్పుడొస్తారో తెలియదు గాని, ఎప్పుడు వెళ్ళిపోతారన్నది మాత్రం తెలుస్తుంది. వాళ్ళు ఉన్నంతలోనే (ఆ 'వేగం'నకు తట్టుకుని) అనుకున్నది అనుకున్నట్టుగా తీయగలగాలి. అలా తీయగల నైపుణ్యం ఈయనకుంది. చకచకా షాట్స్ తీసి స్పీడ్ వర్క్ చేయడం, ఔట్‌డోర్‌లో మరింత హుషారుగా పని చేయడంలో ఈయనకు మంచి పేరుంది. కథనంలో ప్రతి చిన్న విషయాన్ని డ్రమెటైజ్ చేస్తూ, ఎలాంటి సన్నివేశమైనా ఆకట్టుకునేలా రూపొందించడంలో నేర్పరి. షూటింగ్ వెళ్ళే ముందు తాను ఏం చేయదలచుకున్నది క్షుణ్ణంగా ప్రిపేర్ అయి వెళ్తారు గనుక ఎక్కడా కన్‌ఫ్యూజన్ గాని, టెన్షన్ గాని ఉండవు. చిత్తశుద్ధి, నిష్ఠ ఉన్నాయి గనుకే పనులు చకచకా సాగిపోతాయి.

ఈయనిప్పుడు "దొంగ మొగుడు, ఒకరాధ– ఇద్దరు కృష్ణులు, రాక్షసుడు", రావు గోపాలరావు సమర్పణలో జయబాబు చిత్రం, బాలాజీ వారి చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు.

డైరెక్టర్ అవుల కోదండరామిరెడ్డి సాత్వికుడు. సహృదయుడు.

–జి. వి. జి.



"సిల్క్ సవాల్"లో స్మిత

# బొమ్మల సీరియల్!







31/3



























(ఇంకా ఉంది)

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



**ఎ. నాగశ్రీనివాస్, హైదరాబాద్**
**పి. జయలక్ష్మి, నిడుబ్రోలు**

నేటి సమాజంలో స్త్రీని 'అబల'గానూ, 'ఆట వస్తువు'గానూ భావిస్తున్న వారిపై మీ అభిప్రాయం?

ఆడది అబలకాదు ...., ఆటవస్తువు అంతకన్నా కాదని అవసరమైతే "ఆదిపరాశక్తి" అవుతుందని, దుష్టశిక్షణ చేస్తుందని తెలియనివారు అలా అంటుంటారు, అనుకుంటారు.

**కలివరపు విశ్వేశ్వరరావు, నరసన్నపేట**

స్వయంగా మీ వద్దకు వచ్చి ఓ ప్రశ్నను ప్రశ్నించాలని వుంది. మీరు పర్మిషన్ యిస్తారా?యివ్వరా?

మీరు వచ్చే ముందు ఒకసారి ఫోన్ చేసి ... నేను ఎక్కడ వున్నదీ తెల్సుకుని వస్తే మంచిది.

**యం. వెంకటేశ్వరరావు,యర్రగొండపాలెం**

'ప్రతిఘటన' లాంటి చక్కని చిత్రంలో నటించిన మీరు మరలా అటువంటి చక్కని చిత్రంలో ఏమన్నా నటిస్తున్నారా? ఒకవేళ నటిస్తుంటే ఆ చిత్రం పేరు తెలుపరూ?

నేడు మీరందరూ మెచ్చుకుని అభిమానిస్తున్న "అరుణకిరణం" లోని అరుణ పాత్ర. రేపు రాబోతున్న "రేపటి పౌరులు" లోని సరస్వతి పాత్ర నాకు నచ్చినవి. మీరు మెచ్చనున్నవి.

**జి. రాజేంద్రప్రసాద్, దొడ్డిపల్లు**

ఆడవాళ్ళకు ఆడవారే శత్రువని అంటాను. మిరేమంటారు?

మీ మాటతో ఏకీభవించలేను.

**ఇ. సుంకన్న, తమ్మిరాజుపల్లి**

పరస్త్రీని ప్రతి మగవాడు తన స్వంత చెల్లెలిగా భావించిననాడు స్త్రీలపై అత్యాచారాలు జరుగవంటాను. మిరేమంటారు?

మీ అభిప్రాయంతో ఏకీభవిస్తాను.

**వి. వి. హరిప్రసాద్, బ పట్ల**

"జీవితంలో నీవు లేనిదే నేను బ్రతకలేను" అనేంతగా ప్రేమించకూడదని అంటాను. దీనికి మీ సమాధానం?

ఎవరైనా సరే ప్రేమలో పడ్డాక ఇంతవరకే ప్రేమించాలి ...., ఇంతకు మించి ప్రేమించకూడదు అనే కొలబద్దలు పెట్టుకోరు. అలాంటి కొలబద్దలు పెట్టుకొనేవారు ప్రేమించడంలో పిరికివారు. పిరికివాడ్ని అని అంతరాత్మ చెబుతున్నాక ప్రేమించనేకూడదు.

**మద్దిర్ల భాగ్యలక్ష్మి, మంచిర్యాల**

ప్రతిఘటన సినిమా చూసి మీ అభిమానిని అయ్యాను. మిమ్ములను చూడాలని వుంది. వస్తే అనుమతి యిస్తారా?

తప్పకుండా! అయితే ముందుగా తెల్సుకుని రండి.

**ఆర్. మధుసూదన్, అంబుసోలి**

మునుముందు మన సినిమాలు ఎలా వుంటే బావుంటాయంటారు?

నేను మీ ప్రశ్నకు సమాధానం చెప్పడంకన్నా అన్ని సినిమాల్ని చూస్తున్న మీరే ఇకముందు ఎలాంటి సినిమాలు కావాలో తెలిపితే బాగుంటుంది.

**నాగండ్ల వెంకటేశ్వరరావు, అమ్మాపాలెం**

మా అభిమాన దర్శకుడు జంధ్యాలగారి దర్శకత్వంలో మీరు ఏ చిత్రంలోనైనా నటిస్తున్నారా?

అమెరికాలో నిర్మాణం జరుపుకున్న "పడమటి సంధ్యారాగం"లో నటించాను.

**గుడిమెట్ల నాగమణి, వెలగలేరు**

మీరు ఇంతవరకూ ఏ పాత్రనైనా ఛాలెంజ్‌గా తీసుకుని నటించారా?

నేను నటిస్తున్న చిత్రాల్లోని పాత్రలన్నీ ఛాలెంజ్‌తో కూడుకున్నవేనన్నది నా అభిప్రాయం?

**యం. శ్రీదేవి, కల్లూరు**

మీరు పాత్రకు తగ్గట్టుగా నటిస్తారా? లేక ప్రేక్షకుల అభిమానం సంపాదించే విధంగా సినిమాలలో నటిస్తున్నారా?

పాత్రను అర్థం చేసుకుని నటించి, మీ అందరి అభిమానాన్ని పొందుతున్నాను.

**యస్. గోపాలకృష్ణమూర్తి, తిరుపతి**

మీ జీవితంలో మీరు అత్యుత్తమమైనదిగా భావిస్తున్నదేమిటి?

మీ అందరి అభిమానానికి పాత్రురాల్ని కావడం.

**కె. కృష్ణకుమారి, రాజాం**

మీరంటే నాకు చాలా యిష్టం. మీరు నటించే సినిమాలన్నా, మీరు పోషించే పాత్రలన్నా నాకు చాలా యిష్టం. మిమ్మల్ని అభిమానించే యీ చెల్లెలికి మీ ఫోటో పంపిస్తారా?

తప్పకుండా పంపిస్తాను.

**జి. శేష, నర్సాపురం**

"రేపటి పౌరులు"లో మీ పాత్ర గురించి తెలుపరూ?

ఆదర్శ ఉపాధ్యాయిని సరస్వతిగా నటించాను.

ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏదీ ఎన్నికకాలేదు. సం.

---

కూపన్

**ఆంధ్రసచిత్ర వారపత్రిక**

## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

పంపిన వారి పేరు : ____________________

పూర్తి చిరునామా : ____________________

సకల-జన-మనో-రంజని

# సినిమా రంజని

ప్రత్యూష పవనంలా
ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని
కలిగించే సరికొత్త
సినిమా వారపత్రిక!!



త్వరలోనే
మీ ముందుకు మురిపెంగా
వస్తోంది!!

ఆంధ్రపత్రిక

సంస్థ నుంచి మరో ఆణిముత్యం

వర్ధమాన నటి రంజని
"బ్రహ్మచారులు"లో

షాపుల్లో వాళ్ళు ముఖ ముఖాలు చూసుకున్నారుగాని తిరిగి సమాధానం చెప్పలేదు.

చిన్న కుర్రాడే మరలా "అడుగో ఆరుముగం" అన్నాడు

ఆరుముగం శాంక్పవరి ముందుగా మామూలుగానే నడిచిపోతూ ఆ క్షణాన ఇటు చూసాడెందుకో!

అంతే! "అమ్మో గండుచీమలు" అనుకుంటూ పొలాలకడ్డంగా పరిగెత్తసాగాడు.

అతను పోలీసులను చూచి పరిగెత్తటం పోలీసులు అతని వెంట పడటం క్షణంలో జరిగిపోయింది అసంకల్ప ప్రతీకారచర్యలా!

కాలిముత్తు అవతలకు వెళ్ళగానే హోటల్ వాళ్ళు కుర్రవాణ్ణి కోప్పడసాగారు "దారే పోయే దరిద్రాన్ని నెత్తినేసుకున్నట్లు వాళ్ళకెందుకు చెప్పావు ఆరుముగం సంగతి. వాడు ఏం దొంగతనం చేసి తప్పించుకు తిరుగుతున్నాడో! రేపు జైల్లో పెడితే నీ మిద పడి ఏడుస్తాడు. తిరిగి వచ్చాక నిన్ను పట్టుకు చితక బాదుతాడు" అంటూ!

ఆ కుర్రాడికి పదేళ్ళుంటాయి, పేరు కృష్ణ. సినిమాలు చూసి చూసి తను ఒక పోలీసు ఆఫీసర్నవుతానని వూహించుకుంటున్నాడు. అతను వాళ్ళ మాటలను లెక్క చేసినట్లు లేదు. కాలి ముత్తు దగ్గరకు వెళ్ళి "ఆ అమ్మాయి అమెరికన్‌లా పాంటు షర్టు వేసుకుని నల్లటద్దాలు పెట్టుకుంటుంది కదా" అని అడిగాడు.

"లేదే! చీరె కట్టుకుంటున్నది" అని కాలిముత్తు అంటూండే లోపల ఆరుముగాన్ని పట్టుకు వచ్చారు పోలీసులు. అతన్ని చూడగానే-

"వీడా! వీడు లక్ష్మణస్వామి గదూ! పాత కేడీ! ఏరా బద్మాష్! నిన్న తీసుకు వచ్చిన అమ్మాయిని ఏం చేసావు? నిజం చెప్పు! లేకపోతే నీతోలు వలిచేస్తా" అంటూ లాఠీతో తొడమిద ఒక దెబ్బ వేసాడు.

వాడు కొద్దిపాటి దెబ్బకే గోడు గోడున ఏడుస్తూ "నేనేం ఎరుగను సార్! సత్య ప్రమాణకంగా చెబుతున్నా! రోడ్డున నడిచి వస్తుంటే పిల్ల కనపడింది. సరదాగా కాసేపు మాట్లాడుతూ ఇటు వచ్చాం! సాయంత్రం ఆ అమ్మాయి వెళ్ళిపోయింది! అంతే సార్! నేను నిరపరాధిని సార్! వదలిపెట్టండి సార్! సార్! ఇంట్లో మా నాన్నకు జబ్బు చేసి ప్రాణం మిదకు వచ్చింది సార్! మీ పాదాలకు మొక్కుతా".

"రాస్కెల్! రోడ్డున అమ్మాయి పోతుంటే సరదా పడతావా! నిజం చెప్పు ఆ అమ్మాయిని ఏం చేసావో?" అంటూ ఆ చెంపా యీ చెంపా వాయించారు కాన్స్టేబిల్స్!

"అమ్మో! బాబో! చంపేస్తున్నారు! నేనేం పాపం ఎరుగను" అంటూ



# సంకెళ్లెవరికి?

ఏడుస్తుంటే- వాడి చేతులూ కాళ్ళూ కట్టి జీపులో పడవేసి కాన్స్టేబిల్‌ను కాపలా అట్టిపెట్టారు.

కాలిముత్తు కృష్ణను పిలిచి "నిన్న రాత్రి వీడు ఎక్కడవున్నాడు" అని అడిగాడు.

"ఏమోసార్! చీకటి పడ్డాక వంటరిగానే పొలాల నుండి తిరిగి వచ్చాడు! తర్వాత బస్సులో వెళ్ళిపోయాడు."

"వీడి వెంట ఆ అమ్మాయి వున్నదా?"

"లేదు సార్! వంటరిగానే వెళ్లాడు"

"చీకటి పడ్డాక ఎటువైపునుండి వచ్చాడో చెప్పగలవా?"

"ఇదిగో యీ వైపు నుండి" అంటూ ఇంజన్‌షెడ్ వైపుగా చూపాడు కృష్ణ.

కాలిముత్తు కాన్స్టేబిల్స్‌ను తీసుకుని పొలాలకడ్డం పడి వెళ్లాడు.

*　　　*　　　*

బైనాక్యులర్స్ నుండి బర్ట్ శాంక్నువరి టవర్ వైపుగా చూస్తున్న చింటూ ముఖం ఎర్రబడింది! శాంక్నువరి టవర్ నుండి సంకేత సూచకంగా ఎర్ర రుమాలు వూపమని చెప్పాడురాజన్‌కు! అమెరికా టూరిస్టుల దగ్గర హెరాయిన్ దొరుకుతుందని, ఆ పాకెట్‌మద్రాసు జేరిస్తే పదివేలు యిస్తానని చెప్పాడు రాజన్! చిల్లర దొంగ తనాలుచిన్న దోపిడీలు మాని స్మగ్లింగ్ చేస్తూ, ఎక్కువ డబ్బు తక్కువ రిస్క్‌తో సంపాదిద్దామని అనుకుంటూ వున్నాడతను.

బైనాక్యులర్స్ నుండి చూస్తుంటే సి.ఐ. కాలిముత్తు కాన్స్టేబిల్స్‌తో ఇటుకేసి రావడం కనపడిందతనికి. గభాలున పొలాలకడ్డం పడి పరిగెడుదామన్నా వీలుగాదు పోలీసులకు కనపడతాడు.

"అమ్మో! ఎర్ర చీమలొస్తున్నాయి" అన్నాడు చింటూ.

"అయ్యో! ఇక్కడకూ వచ్చారా! ఇప్పుడెలా?" అంది ఛమేలీ!

"ఏం భయం లేదు! పొలంలో దూరాన చాలా కలుపు వున్నది. మనం ముగ్గురం అటు కలుపు తీస్తుందాం! తాతయ్యకు జ్వరం వచ్చింది గదా! మంచం మీద పడుకొని విశ్రాంతి తీసుకుంటాడు." అంది రూప.

"పొలంలో వుంటే వచ్చి పట్టుకోరూ?"

"ఇప్పుడంత కంటే మార్గం లేదు? పరిగెడితే కనపడతాం! ఇలా వుంటే ఎవరో పొలంలో పని చేసే కూలీలు అని వెళ్ళిపోవచ్చు" అంది రూప. చింటూ అంగీకారం అయినట్లు తల వూపాడు.

రూప, ఛమేలీ, చింటూ వంగుని వరి పొలంలో కలుపు తీయసాగారు పొలంలోకి వెళ్ళే ముందు అనుమానం కలిగే వస్తువులన్నీ తీసి మచ్చు మీద పడవేసారు. అందులో రూప హేండ్‌బాగ్ కూడా వున్నది.

కాలిముత్తు ఇంజను షెడ్ దగ్గరకు వచ్చేసరికి మోటారు ఆడుతూంది. అతను ముసలతన్ని-

"నిన్న యిలా ఎవరయినా వచ్చారా?" అని అడిగాడు. ముసలతను సమాధానం చెప్పకపోయేసరికి- "ఇరవై ఏళ్ళ అమ్మాయి ఎవరైనా యిటుకేసి వచ్చిందా?" అని అడిగాడు మళ్లీ.




"నాకు వినపడదు" అన్నాడు ముసలతను. కాలిముత్తు షెడ్డు లోపలకు వెళ్ళి "అరె! లోపల రూములున్నయ్యే! వంట ఏర్పాట్లు కూడా వున్నాయి! వాట్ ఎ స్ట్రేంజ్ థింగ్!" అంటూ గదులు రెండూ పరీక్షగా చూసాడు.

ఒక గదిలో వున్న మచ్చు మీదకు కాన్స్టేబిల్‌ను పంపాడు. వాడు- "సార్! ఇక్కడ కెమేరా, పర్సులూ, సూట్‌కేసు, వేనిటీ బాగ్ వున్నాయి" అంటూ ఒకోటీ కిందకు దించాడు.

"హర హరమహదేవ! శంభోశంకర" ముసలతను పెద్దగా అరవసాగాడు షెడ్డు బయటకు వెళ్ళి.

వేనిటీ బాగ్ చూచాడు కాలిముత్తు. సందేహం లేదు అది ఎ.యస్.పి. రూపదే!

"ఈ సామాన్లన్నీ ఎవరివి? ఇక్కడికెలా వచ్చాయి" ముసలతని చొక్కా పుచ్చుకొని కోపంగా అడిగాడు కాలి ముత్తు.

సమాధానంగా "హర హరమహదేవ! శంభోశంకర" అని గొంతెత్తి అరవసాగాడు ముసలతను.

కోపంతో ముసలతన్ని ఎడా పెడా వాయించసాగాడు కాలిముత్తు. కుప్పకూలిపోయాడు ముసలతను. బూటు కాలితో డొక్కలో తన్నాడు. చలనం లేదు.

"సార్! ముసలాడు...." అనుమానంగా చూస్తూ అన్నాడు కాన్స్టేబిల్.

వంగి అతని నాడి చూసాడు కాలిముత్తు. నాడి అందలేదు! శ్వాస ఆడటం లేదు. వూరికే చచ్చాడే అనుకుంటూ "పదండి జీపు దగ్గరకు! ఆరుముగం సంగతి చూడాలి!" జీపు దగ్గరకు బయల్దేరాడు కాలిముత్తు.

మాట్లాడకుండా అతన్ని అనుసరించారు కాన్స్టేబిల్స్!

ముసలతను "హరహర మహదేవ! శంభోశంకర" అనగానే చింటూ, ఛమేలీ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఆ సంకేతానికి అర్థం వారికి బాగా తెలుసు. "దొరికిపోయాం? జాగ్రత్త" అని.

రూపకు సైగ చేసి వరి దుబ్బుల మధ్య పడుకుని వుండిపోయారు ఇద్దరూ! తనూ అపనే చేసింది. బురద బట్టలకు, వంటికి అయింది! తల కొంచెం పైకెత్తి గాలి పీల్చుకోసాగింది రూప.

దోమలు, చిన్న చిన్న పురుగులూ ముక్కుల్లోకి వెళుతూ వుక్కిరి బిక్కిరి చేస్తునాయి ఆమెను. తల కొంచెం పైకెత్తి చూడసాగింది. కాలిముత్తు అతని వెంట కాన్స్టేబిల్స్ వెళ్ళిపోవడం చూసింది" వచ్చిన వాళ్ళందరూ వెళ్ళిపోయారు" అన్నాడుచింటూ.

వాళ్ళు పూర్తిగా కనుమరుగయాక షెడ్ దగ్గరకు పాకుకుంటూ వెళ్లారు ముగ్గురూ!

పోలీసులు ఎక్కడ నుండి అయినా పొంచి చూస్తున్నారేమోనని బైనాక్యులర్స్‌తో చుట్టూ చూసాడు చింటూ. ఎవరూ లేరని మనసుకు తృప్తి కలిగాక దేకుకుంటూ లోపలకు వెళ్లాడు ముందుగా.

ఇంటి వెనుకనున్న రూపకు చింటూ వెక్కిళ్ళు పెడుతూ 'నాన్నా! నాన్నా" అని ఏడ్వటం వినపడింది.

రూప, ఛమేలీ లోపలకు వెళ్లారు. చలనం లేకుండా పడి వున్న ముసలతని ఛాతీ మీద తల పెట్టుకుని రోదిస్తున్నాడు చింటూ!

సన్నగా మూల్గుతూ ఏడ్వసాగింది ఛమేలీ. పోలీసులు అర్థాంతరంగా వెళ్ళిపోవటానికి కారణం నాన్న మరణం అని అర్థం అవగానే చింటూకు ఏడ్పు ఆగలేదు.

రెండు నిమిషాలలో అతను తేరుకున్నాడు. నాన్న ఎటు దిరిగి లేడిక! చనిపోతూ కూడా తనకు వార్నింగ్ సంకేతం ఇచ్చాడు!

ఆయనకు తగు రీతిగా దహన సంస్కారం చేయాలి. చుట్టు పక్కల పోలీసులు వుండగా ఆయన శవం తీసుకుని వెళ్ళటానికి వీలు లేదు!

కిరసనాయిలు డబ్బా తెచ్చి షెడ్ నాలుగు మూలలా గుమ్మరించాడు. అగ్గిపుల్ల వెలిగించాడు. అయిదు నిమిషాలలో షెడ్ మంటలతో నిండిపోయింది! నాన్నకు సరయిన దహన సంస్కారం చేసానన్న తృప్తితో ముందుకు కదిలాడు చింటూ పొలాల మధ్యగా! అతని వెనకనే వెక్కుతూ ఛమేలీ, రూప బయల్దేరారు.

(ఇంకా ఉంది)

# కుక్కల బండి

## బెడిపాటి సుబ్బరామశాస్త్రి



వీథిలో హడావిడి ఎక్కువగా ఉంది.

అయిదేళ్ల శశి వాకిట్లోకి వచ్చి చూచింది:

నలుగు రైదుగురు మనుష్యులు, అటూ ఇటూ పరుగెత్తుతున్నారు.

వీథిలో బండిలో కొన్ని కుక్కలు నాలుకలు జాపుతూ 'కుంయి కుంయి' లాడుతున్నాయి.

అవి బయటకు రావడానికి వీలులేకుండా తలుపులు బిడాయించి ఉన్నాయి.

కాకీరంగు మట్టలాగులు తొడుక్కున్న మ్యునిసిపల్ కార్పొరేషన్ నౌకర్లు మరికొన్ని కుక్కలను పట్టుకోడానికి ప్రయత్నిస్తున్నారు. వీథికుక్కలు కొన్ని తోక ముడిచి పరుగెత్తి వారికందడంలేదు.

శశి యింట్లో పెంచబడే కుక్క, నేనున్నాననట్లుగా, గబగబా వీథిలోకి వచ్చి వాళ్లనుచూసి మొరగడం ప్రారంభించింది.

బయట ఏ శబ్దం విన్నా, చురుకుగా వచ్చి మొరగడం దాని అలవాటు వచ్చినవారు కుక్కలపాలిట యమదూతలని దానికి తెలియదు. అది చాలా సాధుస్వభావం కలది. శశితో ఆడుకుంటూ ఉండేది. ఇంట్లోతినే వస్తువులున్నా, దానికి ప్రత్యేకంవేస్తే తప్ప ముట్టుకొని ఎరుగదు. దానిని చుట్టుముట్టారు వచ్చినవారు.

పారిపోవడానికి వీలులేకుండా, నాల్గుప్రక్కలనుండి కర్రలడ్డంపెట్టారు. ఒకడు మెడమీద కర్రతో అమిచిపట్టాడు. అది అరవడానికి వీలులేకుండా మూతిని ఒకడు నొక్కి పట్టుకున్నాడు.

అది గిజగిజ లాడింది.

ఉత్సాహంతో దానిని బండలోకి లాక్కు వెడుతున్నారు.

శశి ఏడవడం ప్రారంభించింది.

"అమ్మా! కుక్క!" అంది, బిగ్గరగా.

పెరట్లో పని చేసుకుంటున్న తల్లి బయటకు వచ్చింది.

కళ్లారా చూసింది ఆ దృశ్యం.

శశిని పెంచినట్లే చిన్నప్పటినుంచి, ఆమె ఆ కుక్కపిల్లను కూడా కంతలు తేరేటట్లు పెంచింది.

మమకారం పెంచుకుంది.

గొల్లుమని ఏడ్చేసింది.

ఆ నౌకర్లను బ్రతిమాలింది, విడిచిపెట్టమని.

"డ్యూటీ! మేము వదలడానికి వీలులేదు" అన్నారు, వారు.

"మాది, వీథికుక్కకాదు– పెంపుడు కుక్క, అది ఒకళ్ల జోలికిపోదు" అంది.

"మీకు లైసెన్సు ఉందా?" అని, అడిగారు, వారు.

"లేదు"

"పోనీ, దాని మెడలో ఒక 'పటకా' అయినా, కట్టారా– పెంపుడు కుక్క అనే గుర్తుగా ఉండేందుకు!"

"కట్టాము! కాని, మొన్ననే అది పీకివేసింది."

"అనుభవించండి! మేము మా విధిని నెరవేర్చాలి. అయినా, మీ మగవారినివచ్చి, ఆఫీసులో చెప్పుకోమనండి. వెంటనేవచ్చి, వారేమయినా కనికరిస్తారేమో! మేము మాత్రం–

"కనికరించడానికి వీలులేదా?"

"ఆ అధికారం, మాకులేదు. మేము యమదూతలం. యముడికే ఆ అధికారం!" అంటూ,

వారిమాటలకే వారికి నవ్వువచ్చి పకపకా నవ్వారు.

"నేనొకప్రక్క ఏడుస్తూ ఉంటే, మీకు నవ్వుగా ఉందా?"

"నిన్ను చూసి, మేము నవ్వడంలేదమ్మా! మేము చేసేపనికి మాకే నవ్వువచ్చి నవ్వుతున్నాము." అంటూ, వెళ్ళిపోయారు.

శశి కళ్ళుతిరిగి పడిపోయింది. తననేస్తం వెళ్ళిపోయినందుకు.

తల్లి ముఖంమీద నీళ్ళు కొట్టింది.

ఇంట్లో పడుకోపెట్టింది.

"ప్రక్క యింటి మగవాళ్ళ నడిగింది. మ్యునిసిపాలిటీ వారినడిగి, కుక్కను తీసుకురమ్మని.

"ఇది బస్తీ కదా! మేము ఒకచోట నౌకరి చేస్తున్న వాళ్ళంకదా! మా డ్యూటీ వదిలిపెట్టి మేము ఎల్లా వెడతాము?" మీకుక్క కాదుకదా! మీకేమిటి!" అని వారడిగితే, మేమేమి సమాధానం చెబుతాము?" అని, వారు తప్పించుకున్నారు.

శశికి జ్వరం వచ్చింది.

ఒళ్ళు పేలిపోతోంది.

"కుక్క!" అని అరుస్తోంది.

"వస్తుందిలే!" అని, వెన్ను చరచి సమాధానం చెబుతోంది.

"రాదు!" అంది నిరాశగా!

"వస్తుంది- పడుకో!" అంటోంది, తల్లి.

"ఇప్పుడు తీసుకురా!" అంటోంది.

"నాన్నవచ్చి తీసుకువస్తారు" అంది, తల్లి.

"నాన్న ఎప్పుడువస్తారు?"

"ఇప్పుడేవస్తారు!"

కొద్దిసేపు పడుకుంది.

"నాన్నవచ్చారా?" అని, అడిగింది.

"రాలేదు, వస్తారు?"

"ఈ లోపల ఆ కుక్క చనిపోతుంది. నేనూ చచ్చిపోతాను" అన్నది, నిరాశగా!

"అల్లాంటి మాట అనకమ్మా!" అని, ధైర్యం చెబుతోంది, గుడ్ల నీళ్ళు గుడ్ల కుక్కుకుంటూ.

జ్వరం పెట్లు పేలగా ఉంది.

"అమ్మో!" అని, తల్లి డాక్టరు కోసం పరుగెత్తింది.

డాక్టరు వచ్చారు.

"కుక్కలబండి! కుక్కలబండి! నన్నుకూడా బండిలో తోసివేస్తున్నారు! యమదూతలు!" అని, అరిచింది. డాక్టరు, గుండె చూశారు. టెంపరేచరు చూశారు.

శశి మెడ వ్రేలాడవేసింది. వెంటనే చెమటలుపోసి ఒళ్ళు చల్లబడిపోయింది. నాడిచూశారు, అందడంలేదు. పెదవి, విరిచి వెళ్ళిపోతూ ఉంటే, శశి తండ్రి వచ్చారు.

"కుక్కలబండి- నా కూతురి ప్రాణం తీసింది!" అని, శశితల్లి విరుచుకుపడిపోయింది.

డాక్టర్ ఆమెకు వైద్యం ప్రారంభించాడు. □

# సీరియల్: నిశ్శబ్ద సంగీతం

## బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

రామనాధం గారు మినిష్టరుగారి బంగళాగేటు దాటి లోనికి ప్రవేశిస్తూంటే తోటమాలి ఎదురయ్యాడు.

"ఎవరు కావాలి బాబూ?" ప్రశ్నించాడు.

"మినిష్టరు గారున్నారా?" అడిగారు బంగళా వైపు చూస్తూ.

"అయ్యగారు లేరు బాబూ! కేంపులో వున్నారు!"

తక్కున ఆగి పోయారు రామనాధంగారు. నిరాశగా బంగళావైపు మరో సారి చూసి అడిగారు.

"పోనీ అమ్మగారున్నారా?"

"అమ్మగారు కూడా లేరు బాబూ! వారి తండ్రిగారికి తలనొప్పి ఎక్కువగా వుందని ఉదయం ఫోనొస్తే ఎంటనే గుడివాడెళ్ళారు! వెళ్ళి వారం రోజులైంది!"

రామనాధం గారికి నవనాడులూ కృంగిపోయాయ్. నిస్పృహ ఆవరించింది.

"పోనీ! చంద్రశేఖర్ వున్నాడా?" అడిగారు. అర్ధంగానట్లు చూసాడు తోటమాలి.

"అతనే నోయ్ మినిష్టర్ గారి బావమరది చంద్రశేఖర్!" వివరంగా చెప్పారు.

"అతనా! శేఖరం బాబా!" అని వాడు తేలిగ్గా అంటూంటే కంగారు పడ్డారు రామనాధంగారు.

"అతను అయ్యగారి బామ్మర్ది కాదు బాబూ! అలా అందరితోనూ సెప్పుకొంటాడంతే! అమ్మగారికి దూరపు సుట్టంట! ఏదేనా ఉజ్జోగం యిప్పించమని యిక్కడ మకాం ఏసాడు! అయ్యగారు నాబంలేదు పొమ్మన్నా కదల్డు! అమ్మగార్ని మంచి సేసుకొని వుంటున్నాడంతే!!......."

షాక్ తిన్న రామనాధం గారికి వాడి మాటలు యింక విన్పించలేదు. వెర్రిగాచూస్తూ వుండి పోయారు. ఆయన వాలకం చూసి అనుమాన పడ్డాడు తోటమాలి.

"ఏటి బాబూ! ఏటైంది?" అడిగాడు ఆత్రుతగా.

ఆయన జవాబు చెప్పక పోవడంతో తిరిగి అడిగాడు.

"తమరు గూడా అతగాడికి అప్పుపెట్టేరేటి బాబూ? మినిష్టరుగారి బామ్మర్దినని సెప్పి అందర్నీ నమ్మించి టౌను నిండా అప్పులు సేసేడు. కాపీ ఒటేళ్లలోనూ లాడ్జిల్లోనూ కాతాలు పెట్నేడు! అయ్యగార్ని అడగలేక అళ్లంతా అమ్మగారితో సెప్పుకొని ఏడుత్తున్నారు! తమరు గూడా....."

సంకోచిస్తూ ఆగి పోయాడు.

రామనాధం గారు కొంత తేరుకొన్నారు. సంబాళించుకొన్నారు.

"అహ! ఏమీ లేదు! ఊరికినే అడిగా! నా దగ్గరకి తరుచుగా వస్తూ వుంటాడు"! అన్నారు.

"అయితే తమర్ని గూడా బుట్టలో ఏసుంటాడు! అతగాడి పనులన్నీ తెల్సేక అమ్మగారు కూడా యింట్లోంచి తగిలేసారు! పది హేను రోజులైంది! తిరిగి రాలేదు! ఎక్కడికి పోయాడో తెల్దు!"

"వారం రోజుల క్రితం మా యింటికి వచ్చాడే! పదిహేను రోజుల క్రితమే వెళ్ళి పోయాడంటున్నావ్?" అనుమానం తీరక అడిగారు.

"అతగాడీ బంగళావదిలేసి పదిహేను రోజు లైందన్నాను గానీ ఈ టౌను వదిలేసి వెళ్ళిపోయాడన లేదు గదండి! మీకు ముందే యిద్దరొచ్చి నెత్తీ నోరూ మొత్తుకొంటూ ఎళ్లారు! ఆరికి వేల మీద బాకీ వున్నాడంట! ఇలాంటోళ్ళుంటే పెద్దింటోరి పరువులు పోతాయ్! ఈ యిసయం అయ్యగారెప్పుడో పసిగట్టారు. అందుకే పొమ్మన్నారు. అతగాడు యింకా ఈ టౌనులోనే వున్నాడంటే యింకా అప్పులు పుడుతున్నాయన్నమాట! మోసం సేత్తూ ఎంతకాలం బతగల్డు బాబూ!"

సానుభూతి ప్రకటించాడు.

రామనాధం గారు మౌనం వహించడంతో,

"బాబూ! ఆ డబ్బు మన్ను కాదనుకోండి! ఏనాడో అతగాడికి ఋణపడుంటారు! ఇప్పుడు తీర్చుకొన్నారు! ఇచారించకండి! ఆ యిసయం మర్చిపోండి!" ఓదార్చాడు.

దాదాపు స్పృహలేని స్థితిలో యిల్లు చేరుకొన్నారు రామనాధంగారు.

భర్త చెప్పిన సంగతులు విని కుప్పలా కూలిపోయింది పార్వతమ్మ. ఆ తర్వాత రాగాలు తీయడం ఆరంభించింది.

"శుక్రవారం పూటా నా బంగారం ఈ యింట్లోంచి తరలిపోయింది. నా ధనలక్ష్మి లేచిపోయింది. ఈ కొంపకి దరిద్రం పట్టుకొంది. శని ప్రవేశించింది. వీడు మోసగాడని తెలీక దగా పడ్డాం!"

భార్య శోకాలు రామనాధంగారికి చిరెత్తించాయ్. కోపం తారాస్థాయికి చేరుకొంది. ఎవరిమీద కోపం? ఎందుకని? తనే నమ్మేసాడు! ఆడవారు మోసపోడంలో ఆశ్చర్యంలేదు! పోతేపోయాయ్ నగలు! నిక్షేపంలాంటి మేనరికాన్ని చేతులారా వదులుకొన్నారు. చెల్లెల్తో వివాహ విషయం ఏ మొహం పెట్టుకొని అడగ్గలడు! అంతా కర్మ! సోఫాలో కూలబడి నుదురు రాసుకొన్నారు వేళ్లతో.

* * * *

అనసూయమ్మకి ఎప్పుడూ ఒకే ధ్యాస ఒకే ఆలోచన!

రమకి సంబంధం కుదిరినట్టే! మరి రఘు మాట! మేనరికం తప్పిపోయింది! రేణుకి తనంటే ఎంతో గౌరవం! రేణు చక్కని చుక్క! అన్ని విధాలా రఘుకి సరిపోతుంది. మరి రఘు ఏమంటాడో! ఎలాగైనా వాణ్ణి అంగీకరింపజేయాలి! రేణు ఈ యింటి కోడలైతే తన కెంతో రిలీఫ్! విశాఖపట్నంలో వుండేటప్పుడు రేణు తల్లి సత్యవతీ తానూ ఒదినగారంటే ఒదినగారని పిల్చుకొనేవారు. సత్యవతి చాలా కలుపుగోలు మనిషి. మర్మం ఎరుగదు! అప్పట్లో రఘుబాబుకి రేణుని

జరిగినకథ –6: శేఖర్ మినిష్టరు గారి బావమరిది. తను, ఉష ప్రేమించు కున్నామని, పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నామని, అందుకు రామనాధంగారి అనుమతి కావాలని అడుగుతాడు శేఖర్. రామనాధం గారు తానొకసారి మినిష్టరు గారితో మాట్లాడతానని, ఆయన నిర్ణయంపై వివాహం ఆధారపడి ఉంటుందని తేల్చి చెప్పారు. రమను చూసుకోను పెళ్ళివారు వస్తున్నట్లు రామనాధంగారితో చెప్తారు అనసూయమ్మ. రామనాధంగారు తన కూతురి ప్రేమ వ్యవహారం చెల్లెలితో చెపుతారు. అనసూయమ్మ కృంగిపోతుంది. రమ రేణుని తన అన్న పెళ్ళి చేసుకుంటే బాగుంటుందని తల్లికి సలహా ఇస్తుంది. రమ పెళ్ళి చూపులు అయ్యాయి. తల్లికి తెలీకుండా చంద్రశేఖర్‌కి నగలు ఇచ్చింది ఉష. అవి అతను వారం అయినా తిరిగి తెచ్చి ఇవ్వలేదు.

చేసుకొంటామని యధాలాపంగా అంటూవుండేది తను! అదే నిజమౌతుందేమో! నిజమైతే తానెంతో అదృష్టవంతురాలు! ఈ విషయం రఘుబాబుని అడగాలి!

ఆ రాత్రి భోజనాల సమయంలో అన్నాడు రఘు.

"మా యింజనీరుగారబ్బాయికి వచ్చే వారంలో పెళ్లమ్మా!"

"గాంధీ హాస్పిటల్లో పన్జేస్తున్నారు! డాక్టర్ రమేష్! అతనేనా?" అడిగింది రమ.

"అవును అతనే!" చెప్పాడు రఘు.

"కట్నం ఏపాటి తీసుకొంటున్నార్రా?" అడిగింది తల్లి.

"కట్నం ఏమీ లేదమ్మా! అమ్మాయి గ్రాడ్యుయేట్! బావుంటుందిట! వాళ్లు చాలా బీదవారు!"

"అయితే మీ యింజనీరుగారు చాలా ఉదారులన్నయ్యా!" మెచ్చుకొంది రమ.

"ఆయనది పెద్ద మనసయివుండాలి! ధనవంతులైతే మాత్రం ఎంతమంది కట్నం తీసుకోలేదు! డబ్బు చేదా!" అంది తల్లి.

"అన్యాయంగా తీసుకొనే డబ్బు చేదేకాదు! విషంతో సమానమమ్మా! ఆడపిల్ల తలిదండ్రులు కట్నాన్ని ఎంతో బాధపడి యిస్తారు! ఆడపిల్లని కన్నందుకు వాళ్లని పెనలైజ్ చెయకూడదమ్మా!"

తనయుని అభిప్రాయానికి సంతసించింది తల్లి.

"మరి నీ చెల్లెలుకి కట్నం యిస్తున్నావ్ కదయ్యా!" తనయుణ్ని రెచ్చగొట్టింది.

"కట్నం తీసుకోవడం యిష్టం లేదని చెప్పానుగాని ఈయనని భీష్మించుకొని కూర్చోలేదమ్మా! ఇంత కట్నం కావాలని వాళ్లు దండించి తీసుకొనవసరం లేదు! ఈ ఆస్తిలో మా యిద్దరికీ సమాన హక్కు వుంది! అలాంటప్పుడు వారు రమకి కట్నం అడగడంలో ఔచిత్యం లేదమ్మా! ఉచితమో అనుచితమో! వారు కట్నం కావాలన్నారు యిస్తున్నాం! మన అంతస్తుని చూసి వారు కట్నం అడగకుండా వుంటే వారి పెద్ద మనసుని అభినందించేవాడని! మన కష్టం అయింది. చేసుకొంటున్నాం! ఇప్పుడు వ్యాఖ్యానించడం బాగుండదు! ఏం రమా! ఏవిటి నీ అభిప్రాయం?"

చెల్లెల్ని అడిగాడు రఘు.

"నీ ఆదర్శానికి ఆశయాలకి నా జోహార్లన్నయ్యా! ఆ ఆదర్శాన్ని ఆచరణలో పెడ్తావని నా దృఢ విశ్వాసం!" అంది.

"తప్పకుండా రమా! అమ్మాయి గ్రాడ్యుయేట్ కాక పోయినా కాలేజీ మొహం చూస్తే చాలు! అయితే తక్కిన విషయాలు అమ్మకి సంతృప్తి కరంగా వుండాలి! అమ్మాయి పేదకుటుంబంలోంచి వచ్చినదైనా నా కభ్యంతరం లేదు!"

తనయుని మాటలకి ఆనందపరవశురాలైంది తల్లి. ఆనందాబ్ధిలో మునిగింది రమ.

"బాబూ! ధర్మరాజు గారబ్బాయి వనిపించుకొన్నావ్! మీ నాన్నగారు పేషంట్లు సంతోషంగా ఎంత యిచ్చినా తీసుకొనే వారు! ఇంత కావాలని ఎప్పుడూ దండించే వారు కాదు! ఇవ్వకపోయినా పట్టించుకొనే వారు కాదు! అందరూ ధర్మాసుపత్రి అనేవారు" ఆనందంతో తబ్బిబ్బయ్యారు అనసూయమ్మ.

"అవునమ్మా! ధనికులైన పేషంట్లు ఎంత బిల్లు అయినా ఖాతరు లేకుండా చెక్కు రాసిస్తారు! అలాగే ధనికుల మధ్య కట్నం వ్యవహారం కూడా!"

"కరెక్టుగా చెప్పావన్నయ్యా!" అభినందించింది రమ.

"బాబూ!" అని ఆగారు అనసూయమ్మ సంకోచంగా.

"ఏవిటమ్మా?" ఆత్రుతగా అడిగాడు రఘు.

"నీకూ అలాంటి సంబంధమే చేయాలని వుంది బాబూ!"

"చెప్పాను కదమ్మా! ఫలానా అమ్మాయి బావుంది! నాకు నచ్చింది అని అనూ! ఆక్షణం నుంచే ఆ అమ్మాయిని నా అర్ధాంగిగా స్వీకరిస్తా! పిల్లల క్షేమమేకదమ్మా తలితండ్రులు కోరేది!"

తల్లికి హామీ యిచ్చాడు రఘు.

ఆనందంతో తబ్బిబ్బయ్యారు అనసూయమ్మ. తల్లి చెప్పబోయే విషయం రమకి తెల్సు! ఆత్రుతగా వింటోంది.

"చూసాను బాబూ! ఆ అమ్మాయి చాలా బావుంటుంది! కాలేజీలో రెండో సంవత్సరం చదువుతూ ఆర్థిక యిబ్బందుల వల్ల చదువు మానేసింది!....."

తల్లి వైపు ప్రశ్నార్థకంగా చూస్తున్న అన్నయ్య ముఖ కవళికలను గమనిస్తోంది రమ.

"ఎవరమ్మా? ఆ అమ్మాయి!" అడిగాడు రఘు.

"ఆ పిల్ల మనకేమీ కొత్త కాదురా! చందనపు బొమ్మలా వుంటుంది! నీకు సరైన జోడు! ఆ పిల్ల నాకు కోడలైతే ఎంతో సంతోషంరా!"

"ఎవరమ్మా?" మళ్లీ అడిగాడు.

"మన రేణు బాబూ! నీకు సరైన జోడు!"

రఘులో ఆత్రుత తగ్గింది. ఊపిరి తీసాడు. మౌనం వహించాడు.



# నిశ్శబ్ద సంగీతం

"నువ్ ఊ! అంటే మీ యిద్దరి పెళ్ళిళ్ళూ ఒకేసారి జరిపిస్తా! రమ అత్తవారి. నుంచి ఈ రోజే ఉత్తరం వచ్చింది. త్వరలో ముహూర్తం పెట్టించమని తొందర చేస్తున్నారు!"

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయ్.

"ఏం బాబూ! రేణు బావుండదా?"

ఆతృతగా అడిగింది తల్లి.

"బాగానే వుంటుందమ్మా! అయితే ఆమె గురించి నేనెప్పుడూ ఆలోచించలేదు!" అని అన్నయ్య అన్నా, అతను సుముఖంగానే వున్నట్టు గ్రహించింది రమ.

"నా అభిప్రాయాన్ని చెప్పాను! నువ్ కూడా ఆలోచించు బాబూ!" అన్నారు అనసూయమ్మ సౌమ్యంగా.

"అలాగేనమ్మా!" అంటూ లేచాడు రఘు. రఘు నిష్క్రమించాక తల్లీ కూతుళ్ళిద్దరూ ఒకరి మొహాలొకరు చూసు కొన్నారు. సంతోషాన్ని పంచుకొన్నారు.

తన గదిలోకి వెళ్ళి ఆలోచనలో పడ్డాడు రఘు.

రేణు! రేణు రూపం అతని కళ్ళ ముందు కదలాడింది. విశాఖపట్నంలో ఉన్నప్పుడు తామంతా చిన్నవారు. రమా రేణూ యిద్దరూ ఒకరినొకరు వదలకుండా కల్సి తిరిగే వారు. ఇద్దరూ కల్సి తనను ఆడించాలని ప్రయత్నించేవారు. తిరిగి తనే వాళ్ళని ఏడ్పించేవాడు. రేణు చాలా తెలివైంది. చలాకీతనం తనసొత్తు. వయసొచ్చాక రేణుని మొట్ట మొదటి సారిగా చూసినప్పుడు "ఆమెను చేపట్టేవాడు ఎంతో అదృష్టవంతుడై వుండాలి" అనుకొన్నాడు. రేణుని తిరస్కరించడాన్కి ఏవిధమైన అనర్హతలూ లేవు. అమ్మ చెప్పినట్టు గంధర్వ కన్యలా వుంటుంది. తల్లి కోరికను మన్నించడానికే నిర్ణయించుకొన్నాడు.

మర్నాడుదయం కొడుక్కి స్వయంగా మేడ మీదకి కాఫీ తీసుకొని వెళ్ళారు అనసూయమ్మ. కొడుకు కాఫీ తాగుతూంటే అడిగారు.

"ఏం బాబూ! ఏమాలోచించావ్?"

"ఏ విషయమమ్మా?"

"అదేరా నీ వివాహం సంగతి! రేణు సంగతి!"

"చెప్పాను కదమ్మా! నీకు నచ్చితే నాకిష్టమేనని!"

"నా బాబే! డాక్టర్ ధర్మరాజు గారబ్బాయి వనిపించు కొన్నావ్!" ఆనందంతో తబ్బిబ్బయింది తల్లి.

* * * *

గదిలో కూర్చుని నవల చదువుకొంటోంది రమ.

"ఏవిటి రమా విషయం? అర్జంటుగా రమ్మని ఫోన్ చేసావ్!" గదిలో ప్రవేశిస్తూ అడిగింది రేణు.

"ఏమో! నాకేం తెల్సు! అమ్మ పిలవమంది పిల్చా!" అంది గడుసుగా కళ్ళు తిప్పుతూ.

ఆమె పక్కనే కూర్చొని అడిగింది రేణు.

"నీ కసలు తెలియనే తెలీదా?"

"ఊహూ!"

"అయితే అక్కడికే వెళ్తా!"

"ఎక్కడికి?"

"మీ అమ్మగారి దగ్గరకి!" లేవబోయింది రేణు.

"కూర్చో వోయ్! నేనూ వస్తా! ఒకే ఒక పేజీ వుంది!" ఆమె చేయి పట్టుకొని లాగి కూర్చొ బెట్టింది రమ.

"అందుకే వెళ్తానంటున్నా! వులుకూ పలుకూ లేకుండా సీరియస్‌గా చదువుకొంటూ వుంటే నేనెందుకూ యిక్కడ!" అంది గోముగా బుంగ మూతి పెట్టి.

"ఏదీ! మరోసారి బుంగ మూతి పెట్టు!" ఆమె కళ్ళలోకి చూస్తూ అడిగింది రమ.

"ఏం? బుగ్గలమీద గుద్దుతావా?"

"అహ! పెదవుల్తో నొక్కుదామని!"

"అలాగే! కొన్ని రోజులాగు! తొందర పడకు! ఆ రాజకుమారుణ్ని చూసిన దగ్గర నుంచి నీకాలక్షణాలు ఎక్కువైపోయాయ్!"

"యూ సిల్లీ!" అంటూ పుస్తకాన్ని పక్కకు పెట్టి లేచి నిలబడింది రమ. తర్వాత రేణుని చేయి పట్టుకొని తల్లి దగ్గరకి తీసుకెళ్ళింది.

"ఇదిగో నమ్మా! కుమారి రేణుకాదేవి గారంటే ఈమే! నా బెస్టు ఫ్రెండు!" గమ్మత్తుగా తల్లికి పరిచయం చేసింది.

"బావుందే! వేళాకోళం!" అని కూతుర్ని మందలించి,

"కూర్చో రేణూ! ఉదయం నుంచీ నీ కోసం చూస్తున్నాం!" అన్నారు అనసూయమ్మ ఆప్యాయంగా. ఆమె పక్కనే సోఫాలో కూర్చొంది రేణు. వారికెదురుగా కుర్చీలో ఆశీనురాలైంది రమ.






'ఎందుకో రమ్మనార్ట!' అంది రేణు.

'అవునమ్మా! రమ్మన్నా!' అని ఆగారు అనసూయమ్మ. ఏమి చెబుతారా అని రేణూ, తల్లి ఎలా మొదలు పెడు్తుందా అని రమా ఆమెవంక చూడసాగారు.

"రమ అత్తవారింటి దగ్గర నుంచి నిన్ననే వుత్తరం వచ్చింది. ముహూర్తం పెట్టమని తొందర చేస్తున్నారు!"

రమ పెళ్ళికి ముహూర్తం పెట్టడాన్కి తనను పిలిపించడాన్కి ఏవిటి సంబంధం? కారణం తెలీక తికమక పడింది రేణు. ఆమె వైపే చూస్తూ వుండిపోయింది.

"అన్నా చెల్లెళ్ళిద్దరి పెళ్ళిళ్ళూ ఒకేసారి చేయాలని వారినాన్నగారి కోరిక! రఘుబాబుకి సంబంధం కుదరలేదు!" ఆవేదన వ్యక్తం చేసారు.

"వాళ్ళిద్దరికీ భగవంతుడు జతకూర్చలేదు! మానవ ప్రయత్నంతో బాటు భగవత్సంకల్పం కూడా వుండాలి! అంతకన్నా మంచి సంబంధం శ్రీమంతుల బిడ్డ కోడలుగా లభించొచ్చు!"

ఊరడించాలని ప్రయత్నించింది రేణు.

"శ్రీమంతుల బిడ్డే కోడలుగా రావాలని మే మెప్పుడూ కోరుకోలేదమ్మా! సంస్కారం సాంప్రదాయం కలుపుగోరుతనం గల అమ్మాయి కావాలమ్మా! మాకేం లోటని కట్న కానుకలు ఆశిస్తాం చెప్పు!"

ఆమె మాటలు వింటూ రేణు మౌనం వహించింది.

"నాకు నచ్చిన పిల్లనే చేసుకొంటాననంటాడు రఘు! నాకన్నివిధాలా నచ్చిన అమ్మాయివి నీవే రేణూ!"

తృళ్ళి పడింది రేణు. తాను కలగనడంలేదుకదా! తన మొహంలోకే చూస్తున్న రమని చూసి సిగ్గుతో తలవంచుకొంది. తానెన్నడూ కలల్లో కూడా వూహించని పరిణామం! తొట్రుపడింది! కలవరం చెందింది! మౌనాన్ని వీడలేదు.

"ఏం తల్లీ! ఏవిటి నీ అభిప్రాయం!" అడిగారు అనసూయమ్మ ఆతృతగా.

రేణు సిగ్గు ప్రవాహంలో మునిగి వుక్కిరి బిక్కిరవుతున్నట్లు గ్రహించింది రమ. చివాల్న లేచి ఆమెను వాటేసుకొంది.

"ఏయ్! నిన్నే అడుగుతోంది అమ్మ!" ఆమె బుజాలు కదిపి అడిగింది.

ఆనందాశ్చర్యాల నుంచి తేరుకొని రేణు–

"ఆఁ!' అంది పరధ్యాన్నంగా.

'ఏం?' మళ్ళీ అడిగించుకోవాలని వేడుకగా వుందా? ఒదినగారూ? మా అన్నయ్యకి అర్ధాంగి అయేందుకు అభ్యంతరమా అని అడుగుతోంది అమ్మ" అంది రమ గడుగ్గా యిలా.

"నా మీదా మా కుటుంబం మీదా వున్న సానుభూతితో అలాంటి నిర్ణయానికి వచ్చారని నా అభిప్రాయం! మరోసారి ఆలోచించండి! కొన్ని నిర్ణయాలు అనాలోచనగా తొందరపడి తీసుకోకూడదని నా అభిప్రాయం!" అంది.

"తొందరపాటు ఏమి లేదమ్మా! మేనరికం తప్పిపోయిన వెంటనే నీవే మా కళ్ళ ముందు కన్పించావ్. మా రఘుబాబుకి అన్ని విధాలా అనుకూలమైన అమ్మాయివి నీవే రేణూ!"

"నన్నాలోచించుకోనీండమ్మగారూ!" అంది బేలగా.

"అమ్మగారుకాదు! అత్తగారను!" కరక్ట్ చేసింది రమ చొరవగా.

"ఆలోచించాల్సినవసరంలేదు రేణు! మనం విశాఖపట్నంలో కల్సి వున్నప్పుడే నేనూ మీ అమ్మా అనుకొనేవాళ్లం! మీ యిద్దరికీ ఈడూ జోడూ బావుంటుందని! యధాలాపంగా అనుకొన్న మాటలే ఖాయం అవుతున్నాయ్! నీ కిష్టమేనా? చెప్పు రేణూ! వధూవరుల యిష్టాయిష్టాలు ముందుగానే తెల్సుకోవాలీ రోజుల్లో!" అనసూయమ్మ మరలా అనడంతో –

"అది కాదండీ! అమ్మని మావయ్యని ఓసారి అడగాలి!" అంది నానుస్తూ.

"అంటే నీ కిష్టమనే కదా అర్ధం!" సంబరపడింది రమ.

"అలాగే! పెద్దవాళ్లతో తప్పకుండా మాట్లాడ్తా! ఓసారి మీ అమ్మనీ మావయ్యనీ రమ్మని లెటరురాయి!"

"ఉత్తరం ఎందుకు? ఫోను చేద్దాం!" తొందరపడింది రమ.

"వాళ్ళకి ఫోనులేదు!" అని రేణు అనడంతో ఆగిపోయింది.

(ఇంకా వుంది)




వై. ఎస్., మండపేట

నేను 20 రోజులకే మెన్సెస్ అవుతున్నాను. దీనికి ఏ మందులు వాడాలి?

లేడీ డాక్టర్లు పరీక్షించి రోగ నిర్ధారణ చేస్తేనేగాని ఏ మందులు వాడాలనేది తెలియదు.

ఇలా జరగటానికి చాలా కారణాలుంటాయి. అనీమియా, హార్మోనుల అవకతవకలు, జననేంద్రియాల నిర్మాణంలో లోటు పాట్లు ముఖ్య కారణాలవుతాయి.

ఎ. ఎ., విశాఖపట్నం

మా అమ్మకు షుగర్ కంప్లైంట్ వున్నది. దీనికి తీపి తినకూడదు కదా! తీపి అంటే పంచదార, బెల్లం మాత్రమేనా? లేక పండ్లరసాలు హార్లిక్స్ లాంటివి కూడా త్రాగకూడదా? ఈ వ్యాధి కలవాళ్ళు ఏమేమి తినవచ్చునో తెల్పండి.

డయాబెటిస్ అనబడే మధుమేహ రోగం ఉన్నవారు పంచదార వాడకం తగ్గించినంత మాత్రాన రోగ లక్షణాలు తగ్గవు. రోజూ తీసుకోబడే సగటు కేలరీలు (శక్తిని కొలిచే ప్రమాణం) తక్కువగా తీసుకోవలసి ఉంటుంది. మీకు దగ్గరగా ఉన్న ఆస్పత్రిలోని డయాబెటిక్ డిపార్టుమెంటులోని "డయటీషియన్"ల సలహా ప్రకారం కేలరీలను తక్కువ యిచ్చే ఆహార పదార్ధాలను తీసుకోవడం ఉత్తమం. వైద్యుల సలహా ప్రకారం రోగ తీవ్రతను బట్టి మందులు, క్రమబద్ధమైన వ్యాయామం చాలా అవసరం.

జె. వి., బరంపూర్

నేను 7 సంవత్సరముల నుండి 'ఆస్తమా'తో బాధపడుతున్నాను. నడుస్తున్నప్పుడు ప్రక్కలకు లాగుట, కాళ్ళు, చేతులు వణుకుట, కీళ్ళు పట్టివేయటం వున్నది.

ఆస్తమా రోగం ఉన్నందువల్ల మీరు సరి అయిన పోషక పదార్ధాలను వాడకపోవటం వల్ల నీరసం రావటం జరగవచ్చును. రోగం వచ్చినందువల్ల శరీరానికి తగిన వ్యాయామం లేకపోవటం వల్ల కూడా ఇలా జరిగే అవకాశం ఉన్నది. మీరు వైద్యులచేత పరీక్ష చేయించుకుని రోగ నిర్ధారణ తర్వాత అవసరం అయితే మందులు వాడటం మంచిది.

వి. వి., పొన్నూరు

నా వివాహమై 2 నెలలు అయినది. మేము కొన్నాళ్లవరకు పిల్లలు వద్దనుకున్నాము. ఏ మాత్రలు వాడితే మంచిది?

మీకు దగ్గరగా ఉన్న కుటుంబ సంక్షేమ కేంద్రంలోని వైద్యులను కలుసుకుంటే వారు మీకు ఉచితంగా వాటిని ఇస్తారు. వాటిని వైద్య పర్యవేక్షణలో వాడటం మంచిది. నెలకొక సైకిల్ వంతున ఎన్నాళ్ళు పిల్లలు వద్దనుకుంటారో అన్ని సైకిల్స్ వాడాలి. □




ఆర్.ఆర్. నారాయణపేట

★ అక్కయ్యా! ఈ నీ అభిమాన తమ్మునికి నీ దగ్గిర పర్సనల్ సెక్రటరి ఉద్యోగం దొరుకుతుందా?

● అంబలి తాగేవాడికి మీసాలు పట్ట ఓ సేవకుడా! నాకే పని తక్కువ. అయినా రచన అన్నది చాలా వ్యక్తిగతమైన వృత్తి. దీనికి సహాయం అనవసరం.

జి.ఎన్.ఆర్. రామకృష్ణాపురం

★ కె. ఆర్. గారూ ప్రజా గాయకుడు గద్దర్ చిరునామా చెప్పరూ ప్లీజ్.

● తెలియదు! పాడే పక్షికి ఉరిమే మేఘానికి చిరునామా ఏమిటి?!

ఐ.వి.ఆర్.కె. ఢిల్లీ

★ మొదట దుస్తులు మనిషి ఎందుకు ధరించాడు?

● మొదటి విమర్శకుని వల్ల అయివుంటుంది! విమర్శ వల్లే మనిషి నాగరికుడయ్యాడు. తొలుత-నగ్నతకి అభ్యంతరం చెప్పి సాటివారిని దుస్తులు ధరించ మన్నవాడే తొలి విమర్శకుడు కూడా అయి వుంటాడు! నాగరిక జీవనానికి నాందే విమర్శ.

ఎన్.ఎమ్.ఆర్. హైదరాబాదు

★ దయచేసి సమాధానాలు సమాజానికి అనుగుణంగా చెప్పండి. జోక్ చేయకండి.

స్త్రీలు నేడు యీ విధంగా వున్నారంటా. వరకట్న సమస్యకి మొదటగా వారే కారణం. మీరేమంటారు!

● ప్రతి పెద్ద మనిషి వెనుకా స్త్రీ హస్తం వుంటుందన్నది యిదే కదా!! ఇది జోక్ కాదయ్యా అపార్థం చేసుకోకు.

★ మన దేశంలో నల్ల డబ్బుని రూపు మాపడం ఎలా?

● జరగని పని. ప్రేమ ప్రేమని ప్రేమిస్తుం దన్నట్టు- నల్ల డబ్బు- నల్లడబ్బుని పుట్టించి పెంచి పోషిస్తుంది. మీరు మరి సమాజం కోసం బ్రతికేస్తున్నట్టు పెద్దమనిషిగా వున్నారు కనుక అర్థం చేసుకుంటారనుకుంటాను.

డి.వి.ఆర్. కాకినాడ

★ మజ్ను అమరప్రేమ కథ కాదు సోషల్ అని వింటున్నాం. నిజమేనా?

● ఏమో జూనియర్‌తో జూనియర్ ప్రేమాభిషేకం చేస్తున్నారేమో నాకు తెలియదయ్యా. అయినా ఏ సినీ పత్రికకు రాసినా వివరాలు చెప్తారు– అడుగు.

ఎ.వి.జి.ఎస్.ఎమ్. చీరాల

★ ఎంతగానో అభిమానించిన వ్యక్తి దూరమైపోతే లోకమంతా శూన్యంలా కనిపిస్తుం దెందుకు? ఇది కేవలం మానసిక బలహీనతా?

● కాదు. ఆ క్షణంలో అనిపించిన ఒంటరితనం.

జి.ఎన్.ఆర్. ఎమ్మిగనూరు

★ మనం ఆధునిక విజ్ఞానరంగంలోకి ప్రవేశించామట. మన ప్రధానిగారి ఉవాచ.

● అక్కడ "మనం" అంటే మూర్ఖ ప్రజ అని ఎవరు చెప్పారు? అధికార వర్గం అని చెప్పుకోవాలి.

★ నానాటికి సంఘంలో వ్యక్తికి వ్యక్తికి మధ్య దూరం ఎక్కువైపోతోంది. కారణం?

● జీవన వేగం అంతగా పెరిగి పోయింది. పక్కింట్లో ఎవరేనా చచ్చిపడి వున్నా కంపు కొట్టేదాకా తెలియడం లేదు!

జి.ఆర్.పి. రాయగడ

★ మన విజ్ఞానం ఏ మంచికి ఉపయోగపడుతుంది?

● మన "నిజమైన" విజ్ఞానం మానవాళి పురోభివృద్ధికి దోహదం చేస్తుంది. చెయ్యాలి.

ఎమ్.ఎల్.ఎమ్. సికింద్రాబాదు

★ సెక్సు ఆడదాని ఆయుధం. మగవానికి అయోమయం కదా?

● అసలే రహస్యమేనా ఆయుధమే మూర్తిగారూ, మనిషి దేవుని రహస్యం. అధికారం మగవాడి రహస్యం. సెక్సు ఆడదాని రహస్యం.... ఆ మిస్టరీ అలా వుండేనే అందం.

ఎస్.ఇ.ఎ. తంబళ్లపల్లి

★ పది మందిలో పేరు తెచ్చుకోవాలంటే ఏం చెయ్యాలి?

● పబ్లిక్‌గా కూడని పని చెయ్యడం ఒక దారి. ప్రైయివేటుగా విజయాలు సాధించడం రెండోది!

ఎమ్. ఆర్. డి. బళ్లారి

★ ఈమధ్య మీరు పిల్లల్ని పెంచడం ఓ తపస్సులాంటిది అన్నారు. నాకు చాలా సంతోషం వేసింది - ఇది చదివి. ఇలా ఆలోచించేవారు చాలా తక్కువ మనలో. తమ తీరని కోరికలు తమ పిల్లల ద్వారా తీర్చుకోవాలని తపించేవారే తప్ప యిలా ఆలోచించేవారు తక్కువ.

● నేను నమ్మినది రాశాను.... నేనలాగే చేశాను కూడా. చూస్తూ, చూసి చూడనట్టు వూరుకుంటూ, అవునంటూ, కాదంటూ - ఆడుతూ పాడుతూ పెంచేశానా అన్పిస్తుందిప్పుడు తల్చుకుంటూంటే. కాల చక్ర భ్రమణంలో ముప్ఫైఏళ్లు గడిచిపోయాయి. మా ఇద్దరితో ప్రారంభమైన యీ యాత్ర మళ్లీ మా ఇద్దరితో మిగిలిందిప్పుడు! తల్చుకుంటే - గమ్మత్తుగా వుంటుంది. వేదాంతం ఒంటపట్టలేదు. ఒంటరితనం పీడించడం లేదు. నేనూ మా వారూ కూర్చుని కంపల్సరీగా సాయంత్రం ఓ గంట మాట్లాడుకోవాలని రూల్ పెట్టుకున్నాం. లేకపోతే - కమ్యూనికేషన్ గాప్ వచ్చి - 'భార్యా భర్తల మధ్య మాట్లాడుకుందు కేముంటుంది' అనుకోవలసి వస్తుంది! సగం సంసారాల్లో కీచులాటలు అదీ యిదీ మాట్లాడుకోకపోవడంవల్లే నంటుంది మా డాక్టరు. నేను డాక్టర్లని, లాయర్లని పూర్తిగా నమ్ముతాను. గౌరవిస్తాను.

జి. వి. ఎస్. ఆర్. గరివిడి

★ శ్రీకృష్ణుడు నాస్తికుడని ప్రముఖ కవి శ్రీ ఆరుద్రగారు అన్నారు. అది ఎంతవరకు సమంజసం అంటారు?

● నేనూ అడిగాను. ఇంద్రుని పూజ చేయవద్దన్నాడు కనుక నాస్తికుడని నమ్మాలన్నది వారి అభిప్రాయంగా తోచింది. నాకైతే 'కృష్ణావతారం' చదవడం చాలా యిష్టం. ఎంత చక్కగా రాశారని. □







# ఎర్రసుక్కల సిలుకు సీర

సోమిరెడ్డి జమున

చీపుర తీసుకుని దొడ్డంతా వూడ్చి వీధి వాకిట్లో నీళ్ళు చల్లి రోజూ కంటే వుషారుగా పెద్ద ముగ్గేసి అంట్లన్నీ తళ తళ లాడేట్టు తోమి వంటింట్లో బోర్లించి, మొజాయిక్ నేలంతా శుభ్రంగా తుడిచి బట్టలన్నీ చకచక ఉతికేసిన రంగి వైపు చూసి.

"ఏమే రంగి యీరోజు భలే ఉషారుగా వున్నావే ఏమిటి సంగతి?" అని పలకరించాడు వంటయ్యారు.

"ఎప్పటి నుండో కొనాలను కుంటున్నా నయ్యరూ నాకూతురికి సీర యియ్యాల్టికి అమ్మగారిచ్చే జీతపు డబ్బులతో నా కోరిక తీరతది".

"నీ కూతురుకు నీ అల్లుడు కొంటాడు గానీ ఆ డబ్బులతో నువ్వు కొనుక్కో నరిశిగాడు సంతోషిస్తాడు".

"ఆడికి నేనెట్టా పోతే ఏం అయ్యరూ ఆడికి నాటు సారా బుడ్డీ, కాటన్ మార్కెట్టు వుంటే సాలు" అంత ఉషారులోనూ మొగుడ్ని తల్చుకుని ఉసూరుమంది.

అమ్మగారిచ్చిన జీతపు డబ్బుల్లో అలవాటు ప్రకారం పది రూపాయలు పాత ట్రంకు పెట్టిలో మల్లి చీరకోసం దాచిన డబ్బుల్లో కలుపుదామని చూసే సరికి రంగి ప్రాణాలు పైనే పోయాయి.

"ఒలమ్మో! నా డబ్బులు కొట్టేసార్రోయ్ పాడుద్రవు సచ్చినోళ్ళు"– అని రాగాలు తీస్తూ గుండె బాదుకో సాగింది.

"ఏమయిందే రంగి"

"అయ్యో! అత్తా! నా కూతురు కడుపుతో వున్నపుడయినా దాని కోరిక తీరుత్తాదని పయిసా పయిసా కూడట్టు కున్నాన్రోయ్. దాని లగ్గానికి ఎర్ర సుక్కల సిలుకు సీర తీసియ్యమని అడిగితే అంత డబ్బు ఒక్క సీరకే ఖరుసు సేసేస్తే మెట్టెలు, గొలుసులు, పుస్తెలు బత్తాయి ఒడ్డగింజలు ఎట్టా వత్తాయని ఇంకెప్పుడైనా తీసిస్తానని నా మల్లికి సెప్తిని గదరా. ఇప్పుడు సెమటోడ్చి దాసుకున్న కాసులన్నీ ఎవరో దొబ్బేసేర్రోయ్".

"నర్సిగాడు రిచ్చా ఏత్తున్నాడు గదే కొనిత్తాడులే లెగు" చుట్టూ చేరిన గుంపులో నుండి ఓ కంఠం ఓదార్చింది.

"ఆడి జిమ్మడ ఆడికి సారాబుడ్డి, కాటన్ మార్కెట్టు వుంటే పెళ్ళాం బిడ్డలు గురుతుకొత్తారా?"

"ఏందేహే నేను సచ్చినట్టు శోకాలెడుతున్నావ్?" నర్సిగాడ్ని చూసి అందరూ వెళ్ళిపోయారు.

చేతిలో నాటు సారాబుడ్డి, కోడి,సంచిలో బియ్యం చూడగానే ఆ డబ్బులు నర్సిగాడి చేతిలో పడ్డాయని అర్థమయింది రంగికి.

"....ఓరి సచ్చినోడా కన్న కూతురు నీళ్ళోసు కుందనయినా లేకుండా దానికి సీర కొనాలని సెమటోడిసి కూడబెట్టిన డబ్బులతో సారాబుడ్డి, కోడి కొంటావా?"

"లెగెహే( కోడి కూరొండు. మల్లికి ఒక్క సీరేం కరమ అరడజను సీరల కొంటా. కాటన్ మార్కెట్టులో డబ్బు రావాలే గాని" సారాబుడ్డి పూర్తి చేసి వెళ్ళిపోయాడు వాడు. కాటన్ మార్కెట్టు కట్టి ఎన్ని సుఖాలు తనకిస్తానన్నాడో!

సిరుగుల పాత్తిళ్ళలో పడుకో నున్న కూతురుని చూసి మురుసుకుంది రంగి. మల్లి అని పేరు పెట్టుకుంది.

"నీ కూతురు నీ పెళ్ళాం లాగ పాసిపని చేసి బతక్కూడదు మావా. మారాజు బిడ్డల్లాగ బళ్ళో కెల్లి సదువుకోవాల– ఇప్పటి నుండి పైసలు దాయి మావా".

"అంతా పిచ్చి భమే రంగి నీకు. ఇప్పట్నించి కూడట్టాలా? ఒక్కసారి కాటన్ తగిలిందంటే నా తల్లిని బంగారంలో ముంచనూ!"

అనుభవం తక్కువ అయిన రంగి తన మావ మాటలకు పొంగి పోయింది. మల్లికి ఏడేళ్ళు వచ్చే సరికి రంగికి తన మావ మీద పెట్టుకున్న ఆశల పొంగంతా చల్లారిపోయింది. వాడు రిక్షా లాగి సంపాయించిన డబ్బంతా వాడు తాగే నాటు సారాబుడ్లకు, వాడు మరిగిన కాటన్ మార్కెట్టుకూ సరిపోయేది. రంగి తను పనిచేసే ఇంట్లో నుండి తెచ్చిన అన్నం మెతుకుల్లో మల్లికి, నర్సిగాడికి

భాగం పెట్టేది.

చిరుగుల చీర బొడ్లో దోపుకుని చమురు లేక ఎండ పోయిన తలను గోళ్ళతో సరి చేసుకుని కొప్పెట్టుకుని పాచి పనికి బయలు దేరే రంగిని మల్లి ఆటకాయించింది.

"అమ్మోయ్, అమ్మోయ్! నాకు ఎర్ర సుక్కల సిలుకు గౌను కొనిత్తా నంటివే . కళ్ళు నులుముకుంటూ కాళ్ళు కడ్డం పడింది మల్లి.

"అట్టాగే లేయే మల్లీ. నీకు సొక్కా కొనిచ్చి బడలో ఎత్తాలేయే లేచిన. కూతుర్ని చంకనేసుకుని ముద్దు పెట్టుకుని దింప బోయింది.

"అహఁ నాను యీయాలే కొత్త గౌను తొడుక్కోవాల" ఏడేళ్ళ మల్లి హఠం వేసి చంక దిగలేదు. మల్లి ఎంపరి జుట్టు పైకెగదోసి అక్కడే పడున్న పాత గుడ్డ పేలిక ఆ జుట్టుకు కట్టి పాచి పనికి కదిలించి.

అమ్మగారింట్లో ఎల్లిని చూడగానే రంగి చంకలో నుండి దిగి వెంగున దాని దగ్గరకు పరిగెట్టింది మల్లి.

పాచి పనంతా చేసి మల్లి నెత్తుకుని బావిచాటుకు తీసుకెళ్ళి చద్దన్నం గిన్నె ముందు పెట్టింది రంగి.

"నా కొద్దుపో యీయాల నాకు గౌను కొనిత్తానంటివే"

"అట్టాగే లేయే యీయాల అమ్మగారింట్లో ఇందంట మద్దేన్నం మంచి కూరలేసి కూడెడ్తాగాని ఎల్లి ఆడుకో!"

"రంగీ! ఎక్కడ చచ్చావే యిక్కడ పని తెమలక నేను ఛస్తుంటే తీరిగ్గా కూతురుతో ముచ్చట్లాడు తున్నావా?"

అమ్మగారి అరుపుకు కాళ్ళకు చుట్టుకుని ఏడుస్తున్న ఏడేళ్ళ మల్లిని విదిలించుకుని లోపలికి పరిగెట్టింది రంగి.

పనంతాపూర్తి చేసుకుని బావిలో నీళ్ళు చేది ముఖం కడుక్కుంటున్న రంగికి బావి ప్రక్కనే ఎర్రటి ఎండలో గచ్చు మీద ఏడ్చి, ఏడ్చి నిద్రపోయిన కూతుర్ని చూసి కడుపులో దేవింది. ప్రక్కనే తను కూడా తినకుండా కూతురుకు పెట్టిన చద్దన్నాన్ని కోళ్ళు చెల్లా చెదరుగా చేసేసెయి.

* * * *

అమ్మగారిచ్చిన మిగిలిన కూరలు అన్నం అందుకుంటూ భయంగా అడిగింది రంగి.

"యీయాల మల్లి ఆటం ఏసిందమ్మగారో! ఆ కుర్రదానికి ఎర్ర సుక్కల సిలుకు సొక్కా మీద మోజు పోనాది. వచ్చే నెల డబ్బులు కూడా యిత్తే దానికి కొనెడ్తానమ్మా."

ఆవిడ కాదనకుండా రెండు నెలల జీతం రంగి చేతిలో పెట్టింది. రంగి ఆనందాని కంతు లేదు. మల్లిని లేపుకుని తన గుడిసెలోకి తీసుకెళ్ళి దానికి తను కొనబోయే సొక్కా గురించి. ఆశలూరిస్తూ అన్నం పెట్టి గుడిసె పక్కగా వుండే చిన్న టెంకాయ మట్టల దడిలో రాతి మీద కూచో బెట్టి కుంకుడుకాయ రసంతో తలకుపోసి, తన గోళ్ళతో

# ఎర్ర సుక్కల సిలుకు సీర

మల్లి ఒళ్ళంతా అలుముకున్న మట్టి రుద్ది, నీళ్ళు పోసి, ఆరబెట్టిన జుత్తుకు చిక్కుతీసి అదే పాత గుడ్డ జడకు గుడ్తూ, డబ్బులు మిగిలితే ఒక రిబ్బను ముక్క కూడా కొనాలని అనుకుంటూ మల్లిని చంక నేసుకుంది రంగి.

"నువ్వు బువ్వ తినవా?" తల్లి నడిగింది మల్లి.

"ఈ సంబరంలో మరిసే పోయానే దిగు." అంటూ తను తిని నర్శిగాడికి నాలుగు పిడసలు చిమలు తినకుండా చెక్కపెట్లో పెట్టి గుడిసెకు చిక్కేసింది. గౌను కొనడానికి అమ్మ, కూతురు బయలు దేరారు.

నాలుగడుగులు నడిచేసరికి ఎదురుగా రొప్పుకుంటూ వెనకింటి వెంకటేశు పక్కింటి కిష్టడు వచ్చి–

"నరిశి మావను ఆసుపత్రిలో ఏసారు లగెత్తు!" అని చెప్పారు.

"ఓ యయ్యోయ్! నా మావకేమయింది రోయ్!" శోకాలు తీస్తూ అడిగింది రంగి.

"నాటు సారాలో కలితి ఏదో సేసారంట. పడిపోనాడు. మేమూ వత్తాం పద."

మల్లిని సంక నేసుకుని పరుగులాంటి నడకతో హాస్పిటల్‌కు చేరింది. అప్పటికే నర్సింహులికి పొట్టంతా శుభ్రం చేసారు.

సెలైన్ సీసాలకు, మందులకు రంగి బొడ్లో డబ్బులు మాయమయి పోయాయి.

మావకని ఎత్తిపెట్టిన అన్నం, కూర మల్లికి పెట్టి బాగా సంపాయిస్తున్నా– ఆ డబ్బంతా దుర్వ్యసనాలకు కాజేస్తున్న మొగుడ్ని తల్చుకుని దాని ఖర్మకు దాన్నే నిందించుకుంటూ పడుకుంది ఆ రాత్రి వుత్త కడుపుతో రంగి.

* * * *

ప్రొద్దున్నే లేచి నీరసంగా పనిలో కెళ్ళింది. రాత్రి గంజి కూడా లేక కడుపులో ప్రేగులు అలల్లాడి పోయే బాధ కంటే మల్లికి గౌను కొనలేక పోయానే అనే బాధ దాని కెక్కువగా వుంది. అమ్మగారిచ్చిన చద్దన్నం తినాలని ముద్ద నోట్లో పెట్టుకోబోతుంటే గుడిసెలో కాళ్ళు డొక్కలో పెట్టుకుని పడుకోనున్న నర్శిగాడు గుర్తు కొచ్చాడు. వాడు చేసిన పాడు పనికి కోపంగా వున్నా కట్టుకున్న పాపానికి ఆ అన్నం తను తినకుండా గుడిసెలోకి తీసుకెళ్ళి వాడి ముందు పెట్టి–

"మావా! ఆ సారాలో ఏం రుచుంది సెప్పు. పోని పాణానికి సుఖమన్నా వుందా? ఆ సారా తాగబట్టి కదా నిన్ను ఆసుపత్రిలో ఏసారు. మల్లికి సొక్కాకని అమ్మగోర్నడిగి రెండు నెలల కట్టం ముందుగానే తీసుకున్నాను. అదుండబట్టి, నీ మందులకు. సరిపోనాది లేకుంటే అప్పటికప్పుడు మన కెవడిత్తారు సెప్పు మావా! ఆ పాడలవాట్లు మానేత్తే మల్లికి ఎన్ని సొక్కాలయినా కొనుక్కోమా? దాన్ని బళ్ళో ఏసి చదివించుకోమా? ఆ సారా తాగబట్టే కదా నిన్న పాణం మీదకు తెచ్చుకున్నావు? నువ్వు రిచ్చా లాగి సంపాయించే డబ్బుతో, నేను అమ్మగోరి దగ్గర తెచ్చుకునే పైసలతో ఎంత సుకంగా వుండొచ్చు ఆ పాడు సారా ఇంకయినా మానేయ్ మావా?" మంచిగా చెప్పుకుంది.

"నిన్నూ మల్లిని సుఖపెట్టాలని గదే కాటన్ ఆడేది– కాటన్ అడాలంటే మెదడు బాగా పని సేయాలే. దానికి సుక్క పడందే లాబంలేదే రంగి"

అతడు చెప్పినా వినడని తెలుసుకున్న రంగి–

"సర్లే మావా? ఈ గంజి నీవూ మల్లి తాగేయండి. అమ్మగోర్నడిగి నేను ఏదైనా పెట్టించుకుని తింటాలే– నేనొత్తా ఎక్కడి పని అక్కడే వుంది."

"ఎదవ గంజి ఎవడిక్కావాలే రంగి. నీకాడ డబ్బులుంటే యియ్యే. నా గొంతు తడుపుకోకుంటే లాబం లేదే!"

"నాకాడేడుంది మావా! పిల్లదానికి కొనాలనుకున్న సొక్కా డబ్బులంతా నిన్న నీ మందులకే కరుసయి పోనాది కదా!" అని గుడిసె దాటబోయింది.

డబ్బుండి ఇవ్వనంటొందని కోపంతో రంగి జుట్టు పట్టుకుని వంచి వీపు మీద నాలుగు గుద్దులు గుద్దాడు.

"అమ్మను కొట్టగాకయ్యా!" అప్పుడే నిద్రలేచిన మల్లి నర్శిగాడి చేతులు పట్టుకుంది.

దాన్ని విదిలించి కొట్ట విసురుగా గుడిసెవతలక వెళ్ళబోతున్న నర్శిగాడి కాళ్ళకు చద్దన్నం గిన్నె తగిలి వీధిలోకి పోయి బోర్లపడి పోయింది.

నీరసంగా వున్న రంగి ఆ గుద్దులతో కూలబడి పోయింది.

"నాకు గౌను ఒద్దే! ఆ డబ్బులు అయ్యకిచ్చేయి.

అమ్మ కేమవుతుందో అనే భయంతో ఏడ్చేసింది మల్లి. ఆ పసి మనసుకు ఏమనిపించిందో అప్పటి నుండి ఎర్ర సుక్కల గౌను కావాలని గానీ, ఎర్ర సుక్కల పరికిణీ కావాలని గానీ వాళ్ళమ్మను అడగలేదు. పెళ్ళికి మాత్రం డబ్బులుంటే ఎర్ర సుక్కల సిలుకు సీర కొనిమ్మా అని అడిగింది.

"ఏంటే రంగి అలా కూకొండిపోయావ్. కోడికూర వండలా!" నర్శిగాడి కోపం తెలిసిన రంగి గతం నుండి తేరుకుని లేచి కూరొండి వాడికి పెట్టింది.

"ఏది ఎట్టయినా మల్లికి పురుడయ్యేలోపల సీర కొనాలని" నిర్ణయించుకుంది.

"మల్లికి పురుటి రోజులు వస్తున్నాయి మావా ఖర్మారపు పండు పట్టుకెళ్ళి దాన్ని పురుడుకు తీసుకొత్తానయ్యా!"

"నీ దగ్గరుండే డబ్బు లిట్టియ్యే ఆ డబ్బులకు కాటన్ కట్టి మల్లికి పాల సిట్లు సేయంచి యిట్టిడు పట్టుకెళ్లాం."

"ఆ మాట విని, విని విసిగిపోయిన రంగి ఆ వూసెత్తితే తన దగ్గర మరోలా దాచుకున్న డబ్బులు లాగేస్తాడని నిద్ర నటించింది.

"పొద్దుప్రవుగొట్టు మొహం పడుకుంటే నిద్రో తది" అనుకుంటూ వాడూ నిద్రలోకి జారిపోయాడు.

* * * * * * * *

తన గుడిసెలో దాచుకుంటే నర్శిగాడు తీసేసుకుంటాడని తను పనిచేసే అమ్మగారి దగ్గర

మూడు నెలలనుంచి పైసా పైసా చేర్చుకున్న డబ్బులు అడిగి తీసుకుంది. రెండు రూపాయలకు కర్జూరపు పండు కొని మూట కట్టుకుంది. పిల్లదానికి పురి తీకే తీసుకురాడానికి ఎల్తున్నానమ్మా ఓ పాత సీరుంటే పడేయండమ్మా! అని అడిగితే ఇచ్చిన చిరిగిపోయిన.తెల్ల సిలుకు చీర మడతేసుకుంది.

కడుపులో పేగులు అరుస్తున్నాయి. అయినా ఉషారుగా నడుస్తోంది. కూతురి కోరిక తీర్చబోతున్న సంతోషంలో నడుస్తోంది. రెండు కిలో మీటర్లు నడిచేసరికి రంగి వంట్లో ఓపిక నశించింది.

కడుపులో ఆకలి, ఒంట్లో నీరసం కలిసి రంగిని రోడ్డు ప్రక్కగా పోసే దోసెలమ్మి దగ్గరకు నడిపించాయి. దోసె పదిహేను పైసలు పల్చగా వున్నాయి.

"తన ఆకలి తీరాలంటే అరవై పైసలన్నా కరుసు సేయాల - ఆ డబ్బులే సీరకు తక్కువయితే అమ్మో!! ఇంకేటయినా వుందా? ఎన్నో ఏళ్ళనుండి తన కూతురి కోరిక తీర్చలేకుంది. ఇప్పుడూ అట్టాగే తీర్చలేకపోతే ఇక వయసుమీరి పోతున్న తను కూడెట్టి కొనగలదా?

అలా మనసులో అనుకుని నడవ సాగింది.....

చెమటలు కారిపోతున్నాయి. కళ్ళు తిరిగిపోతున్నాయి. పొలాలమ్మట అడ్డ దారినబడి నడుస్తున్న రంగి కాళ్ళు ఇక నడవలేమని మొరాయించాయి. అక్కడే తుమ్మచెట్టు నీడన కూలబడిపోయింది. పెద్ద తుమ్మ ముల్లు కసుక్కున పాదంలో దిగబడింది. ముల్లు లాగేసరికి నెత్తురు బొటబొట కారింది.

రంగి మనసునిండా ఆవేదన. దానికి తన మొగుడు గుర్తొచ్చాడు. "అదే తన మొగుడు మంచోడయితే తన కూతురడిగిన ఒక్క కోరికకు తనింత కట్టపడాల్సి వచ్చేదా? ఇలా ఒంటరిగా నడచి యీ చేలలో యిలా కూలబడాల్సి వచ్చేదా? ఇద్దరూ కలిసి తన కూతురి దగ్గరకు రిచ్చాలో ఎల్లేవాల్లుకదా! రిచ్చాలాగి సంపాయించిన డబ్బంతా పాడలవాట్లకు ధారపోయకుంటే తమ బతుకులు ఎంత బాగుండేవి? తాగుబోతోళ్ళకంతా ఆ సత్తెం ఎందు కర్ధంకాదో?"

రంగి కళ్ళు మత్తుగా కూరుకుపోతున్నాయి. అలసట ఆమె శరీరాన్ని ఆక్రమించుకుంటోంది. ఆమె మనసు మాత్రం ఇంకా పనిచేస్తూనే వుంది. ఆమె గుండెలు మండిపోతూనే వున్నాయి.

"అస్సలీ గవర్నమెంటోళ్ళకి బుద్ధి లేదు. ఎందుకొప్పుకోవాలంట సారా కాయడానికి?.... ఉహు..... ఈ కల్లుపాకలోళ్లనంతా పాడిసేస్తేసరి మరిక కల్లుపాక లెట్టను మిగతోల్లు భయపడేట్టుగా!

ఇంకేంచేస్తే యీ తాగుబోతోళ్ళు యీ పెపంచంలో మిగలకుండా వుంటారో.... ఆలోచిస్తూనే వుంది. ఆలోచించి.... ఆలోచించి ఆమె మనసు అలసిపోయింది. అది నిద్రాదేవి చిలిపితనానికి లొంగిపోయింది.

రంగికి మెలకువ వచ్చేసరికి సూర్యుడు నడినెత్తిమీద కొచ్చేసాడు. తన బండతనానికి తిట్టుకుంటూ లేచింది. పాదం క్రింద మోపగానే జివ్వుమని లాగింది. కుంటుకుంటూ కొంతదూరం నడిచింది. పొలాలకు పారే నీళ్ళు కాలువలో విసురుగా పారుతున్నాయి.

చిన్నగా కాలువ దగ్గరకు నడిచి కాలువలోకి వంగి ముఖం కడుక్కుని దోసిట్లోకి నీళ్ళు తీసుకుని త్రాగింది. బొడ్లో పైటలాగి ముఖం తుడుచుకోబోయేంతలో డబ్బులు కట్ట జారి నీళ్ళలో పడిపోవడం - ఆ విసురుకు కొట్టుకుపోవడం కనురెప్పపాటులో జరిగిపోయింది.

"నా డబ్బులు - నా డబ్బులు" పెద్దగా కేకేసింది.

అక్కడే పొలాల్లో పని చేసుకుంటున్న మనుష్యులు రంగి అరుపులకు పరిగెత్తుకొచ్చారు.

"బాబ్బాబు నా బిడ్డకు సీర కొనాలని పోగెట్టిన డబ్బులు బొడ్లో దోపుకున్నాను బాబూ అయి మిడియాలుగా నీళ్ళలో జారిపోనాయి. దిగి నా డబ్బులు తెచ్చి పుణ్యం కట్టుకోండయ్యా!" పిచ్చిపట్టిన దానిలా అరుస్తోంది.

వచ్చిన మనుష్యులు నీళ్ళలోకి చూసారు. వాళ్ళకెక్కడా ఆ పారే నీళ్ళలో డబ్బులు కట్ట కన్పించలేదు.

"భలేదానివమ్మో - ఏ బిడ్డో నీళ్ళలో మునిగిపోతే కేక లేస్తున్నావని పని వదిలిపెట్టి లగెత్తుకొచ్చాము. డబ్బులు కాగితాలు ఇంతసేపు ఇక్కడే వుంటాయా? ఎల్లెల్లు" వాళ్ళ పనిలోకి వాళ్ళెళ్ళిపోయారు.

ఆమెకు మనసునిండా దిగులు - కడుపున పుట్టిన బిడ్డ పోయినంత దిగులు. సర్వం కోల్పోయి బికారిలా మిగిలిపోయినంత నైరాశ్యం.

"ఎర్ర సీర" దాని కళ్ళ ముందు కన్పిస్తోంది. కడుపుతో వుండే కూతురుకాడికి 'సీర' కొని పట్టుకెళ్ళాలని తనెన్ని కలలు కంది. కడుపుకు సరిగ్గా తినకుండా దాచిన డబ్బులన్నీ దాని కళ్ళముందే నీళ్ళలో కొట్టుకుపోతే ఆమె గుండెలో మంటలు ఎగిసిపడుతున్నాయి.

"పాపిష్టిదాన్ని. మల్లికి నచ్చిన ఎర్ర సుక్కల సీర కొనుక్కుంటాదని ఆశపడకుండా తనే అలాటి సీర కొని పట్టుకొచ్చుంటే ఇలా.... ఇలా.... అయుండేది కాదుకదా! పోనీ కొద్ది దూరానికి పాలుమాలక రోడ్డంట నడిచుంటే యీ అవాంతరం జరిగేదికాదుకదా!" అనుకుంటూ గట్టున పెట్టిన ఖర్జూరపు పండు మూటను, పాత చీరను అందుకుని అక్కడే కూలబడి ఏడవ సాగింది.

"వుత్త సేతులతో మల్లికాడికి ఎల్లను-ఎల్లలేను" అనుకుని వెనక్కి నడిచింది.

నాలుగడుగు లేసేసరికి తల్లి పేగు కూతుర్ని చూడకుండా వెళ్ళిపోడానికి మనసొప్పలేదు. ఆ ఖర్జూరపు పండు మూటను గట్టిగా గుండెల కదుముకుని మరలా ముందుకు నడిచింది.

కడుపులో ఆకలి, ఒంట్లో నీరసం, గుండెల్లో దిగులు కలిసి ఆ మిట్ట మధ్యాహ్నం మల్లి గుడిసెకు చేరేసరికి రంగి నిస్త్రాణ అయిపోయింది.

మల్లి గుడిసె చుట్టూ జనం పోగయి వున్నారు.

రంగి ఆరిపోయిన పెదాలు విచ్చుకున్నాయి. పిడచ కట్టుక పోయిన నాలుక "నాకు మనవడో, మనవరాలో" అని సంబరంగా అంటోంది. నడవలేని కాళ్ళకు ఉత్సాహం వచ్చి గుడిసెలోకి అందర్ని తోసుకుని పరిగెత్తాయి.

"మల్లి అమ్మ వచ్చింది" గుస - గుసగా అంటున్నారు.

నెత్తురు ముద్దలాటి పసిబిడ్డను చూస్తాననుకున్న రంగికి తన కూతురు నెత్తురు మడుగులో నిర్జీవంగా పడుండడం చూసి బిత్తర పోయింది. సత్యం బోధపడ్డాక పెద్దగా ఏడుపు లంకించుకుని కూతురిమీద పడిపోయింది.

అయినా పెళ్లి సేసిందేగాని ఒక్కనాడయినా వచ్చి కన్న బిడ్డను సూసిందా? సీర - సారె పెట్టకపోతే పోనాది. పుట్టింటికి తోడుకుపోకపోతే పోనాది నీళ్ళోసుకున్న పిల్ల బాగోగులన్నా కనుక్కుందా?"

"పోనీలెండి ఆఖరి సూపయినా దక్కింది. లేకుంటే ఈ కోపిష్టి ఈరిగాడు మల్లి అమ్మకు, అయ్యకు సెప్పి పంపేవాడేనా?"



# ఈ·వేమన·పద్యాలు




కాంచనంబు పైన కాంతుల పైనను
బ్రహ్మకైన బుట్టు రిమ్మ తెగులు
తోయజాక్షి విడుచు దొర యెవ్వడును లేడు
విశ్వదాభిరామ వినురవేమ.

"వాడి కోపం తగలెడ. సెందు మూలాలనయినా లేకుండా వాడడిగిన సుకం .యీలేదని పొట్టమీద తంతాడా పాడుదరిద్రపు సచ్చినోడు."

"సక్కటి బిడ్డనుకనాల్సింది. కసాయోడి సేతిలో నెత్తురు మడుగులో సచ్చినాది. దాని రాతకొప్పి దొరికాడు."

కూతురు మీదపడి భోరున ఏడుస్తున్న రంగి చెవుల్లో వాళ్ళందరి మాటలు పడ్డాయి. దాని గుండెలు మండిపోతున్నాయి. తన కూతురు చిరుగుల సీర పాత్తిళ్ళలో పడుకుని తనను అమ్మనుసేసి పోంగానవ్విన కూతురు "నాకు ఎర్రసీర కొనివ్వవా?" అని ఆశగా అడిగిన కూతురు - అడిగి,

## ఎఱ్ఱ సుక్కల సిలుకు సీర

అడిగి అలిసిపోయిన కూతురు-

"కడాకు మనువాడేటప్పుతయినా కొనియ్యవే" అని బతిమిలాడిన కూతురు-

"కొసాకు నువ్వు చచ్చాక కప్పడానికైనా ఎఱ్ఱ సుక్కల సిర తేలేకపోయానే మల్లి" బావురుమంది రంగి.

అంతవరకు పొర్లి పొర్లి ఏడుస్తున్న దానికంట్లో ఒక్క నీటిబొట్టు కూడా రాలేదు. ఇప్పుడు తన షికే ఒక్క కూతురడిగిన చిర కొనివ్వలేని తన అసమర్థతకు గుండె ద్రవించి కన్నీరు చిలికింది.

ఎందుకని? ఎందుకని కొనివ్వలేకపోయింది. రెక్కలు ముక్కలు సేసుకుని గడిత్తున్నా ఎందుకు కొనలేకపోయింది? పోనీ దాని పెనిమిటయినా దాని కోరిక తీర్చలేదు ఎందుకని? ఆడి సంపాదనంతా తాగనే సరిపోయె!

అలా తన అల్లుణ్ని తలుచుకోగానే బిడ్డ శవంమీద పడున్న రంగికి రిక్షామీద రోజుకు ఇరవైరూపాయిలు సంపాయించే మొగుడు గుర్తొచ్చాడు. వాడి కాటన్ మార్కెట్ గుర్తొచ్చింది. వాడి తాగుడు గుర్తొచ్చింది.

"సి ఎదవ ఆడివల్లే నా కూతురు సచ్చిపోనాది. సి....సి. ఆడితో సస్తే కాపురం సేస్తదా తను?" అంత బాధలోనూ మొగుణ్ని చీదరించుకుంది.

రంగి గుండెల్లో తాగుబోతు వాళ్ళంటే అసహ్యం. తన బిడ్డను చంపిన తాగుబోతోళ్ళంటే విరక్తి. ఆ విరక్తి మధ్యగా ఆ తాగుబోతు తండ్రి దగ్గర నుండి తాగుబోతు భర్త దగ్గర నుండి ఏమి పొందలేని చనిపోయిన తన కూతురుమీద పొంగిన విపరీతమైన జాలి, ప్రేమ ఆమెను కంటికు కడివెడుగా ఏడ్చేటట్లు చేసాయి.

"నీ కోసం ఖర్జూరపు పండు తెచ్చానే మల్లి - నీ యమ్మ సేతిది తినకూడదనుకున్నావా?" పెద్దగా ఏడుస్తున్న రంగి ఒక్క ఉదుటున లేచి తను తెచ్చిన తెల్లటి సిల్కు పాత చీర ఆ గుడిసెలో పరిచి ఆ చీరనిండా తన కూతురు చుట్టూ మడుగులా వున్న రక్తంతో చుక్కలు పెట్టసాగింది.

"ఏటిహిం కూతురు సావు సూసి ఆ తల్లికి పిచ్చిగాని పట్టిందా? కూతురు సచ్చిపడుంటే నెత్తురుతో సింకి సిరమీద సుక్క లెడుతుందేవిటి?" ఆ గుంపులో ఒక ముసలిది బుగ్గన వేలేసుకుని అంది.

"మల్లి! నీకు ఎఱ్ఱ సుక్కల సిలుకు సిర తెచ్చానే ఇంద ఇదిగో నే మల్లి" ఏడుస్తున్న రంగిని గుడిసెలో వాళ్ళంతా పట్టుకుని-

"లే! దయిర్యం తెచ్చుకో. నీ కూతురు ఆయుసు ఇంతే ననుకో!"

కూతురు శవంమీద నుండి లాగి ఓదార్చాలని ప్రయత్నిస్తున్నారు. ఏడ్చి ఏడ్చి అలసిపోయిన రంగి తన కూతురు శవాన్ని కాటికి తీసుకెళ్ళడాని కొచ్చిన జనాన్ని చూసి అరిచింది.

"వొద్దు. వొద్దు. నా బిడ్డను అట్టుకెళ్ళొద్దు" వాళ్ళు రంగిని ప్రక్కకు లాగి మల్లిని ఎత్తుకున్నారు. మల్లిమీద రక్తపు చుక్కల తెల్ల చీర.

"తల్లి! నా మల్లే, ఎఱ్ఱ సుక్కల సిలుకు చిర నిన్ను సంపేసిందే. అది తెచ్చి నిన్ను పుట్టింటికి తోలుకెళ్దామని ఆలీసం చేసానే కూతురా! లేకపోతే బేగొచ్చి నిన్ను తోలుకెళ్ళుంటే నీకి సావు రాదు కదే!" ఆ తల్లి కడుపు శోకం చూసి చుట్టూవున్న వాళ్ళ కళ్ళల్లో కూడా నీళ్ళు నిలిచాయి.

ఎఱ్రచుక్కల చీర నేనేం చేసానన్నట్టు జాలిగా చూసింది. తాగుబోతు నిషా అల్లుడు తూలుతున్నాడు. భార్య శవంమీద చీర అమ్ముకుంటే ఓ బుడ్డికైనా సరిపోద్దా? అని ఆలోచిస్తున్నాడు. □

# ఈ బావుకి కర్తవెవరు?

## ముసునూరి పేరయ్యశాస్త్రి

రెండు గంటల నుంచి బస్సు కోసం ఎదురు చూస్తున్న మేము- దూరంగా 129 నెంబరు బస్సు కనిపించగానే పరుగులు తీస్తున్న జనాన్ని చూసి మేమూ పరిగెత్తాము. నాతో పాటె సినిమాకి వచ్చిన కొలీగ్స్ అరుణ, వెంకట్, పద్మ అప్పుడే వాళ్ళు బస్సెక్కేయడం - సీట్లు ఆక్రమించేసి- నాకో సీటు రిజర్వు చేసి త్వరగా నన్ను రమ్మని అరిచేస్తున్నారు. సిటీ బస్సుల గేటు దగ్గరుండే జన వ్యూహాన్ని ధైర్యంగా ఛేదించలేని నేను అతి ప్రయత్నం మీద బస్సెక్కి- నా సీటులో కూలబడ్డాను. అప్పటికే బస్సు నిండి పోయి వుంది.

'ఒక అరగంట ఆలశ్యముంటుంది. మేము టీలు త్రాగాలి' అన్నాడు కండక్టరు. అతను ఎర్రగా ఉన్నాడు. అందంగా ఉన్నాడు. అతని ముఖంలోని అమాయకత్వం అతనికి మరింత శోభను కల్గిస్తోంది.

ఇంతలో -

రెండు గంటల్నుంచి బస్సు లేక చస్తున్నాము. తర్వాతటీలు త్రాగొచ్చుగానీ ముందు పదండి" ఒక ప్రయాణీకుడు చాలా మొరటుగా అన్న మాటలవి.

కండక్టర్ తెల్లబోతూ నిలబడి పోయాడు. ఏమని సమాధానం చెప్పాలో తెలియక - తికమక పడి చివరకి "రైట్" అని అరిచాడు. అందరూ గొల్లుమన్నారు. అతనిముఖం చిన్నబోయింది. డ్రైవర్




సీట్లో డ్రైవర్ లేడు.

పావుగంట తర్వాత బస్సు బయలు దేరింది.

హడావిడి......

కబుర్లు......

పిల్లల ఏడుపులు.....

నవ్వులు......

ముందూ వెనుకా పరిగెత్తే వాహనాల మ్రోత.....

ఈ హడావిడుల మధ్య కండక్టర్ టికెట్లు కొట్టడం ప్రారంభించాడు. కొద్ది దూరం వెళ్ళాక బస్సు ఆగింది. ప్రయాణీకుల్లో అలజడి.

"ఏమైంది మళ్ళీ" ఎవరో ప్రయాణీకుడు.

"ఇమ్మియింగ్ స్టేజ్ సర్" నా ప్రక్కనే కూర్చున్న వెంకట్ అన్నాడు.

"నారాయణ, ఖర్మకాలి ఈ బస్సెక్కాము నాయనోయ్" రాగం తీస్తూ అన్నాది అరుణ. అందరూ తలోరకంగా మాటల బాణాలు విసురుతున్నారు. అవేమి పట్టించుకోకుండా కండక్టర్ టికెట్లు కొడుతున్నాడు. అయితే- అతను ఎక్కడి కని అడిగే పద్ధతి. డబ్బులు తీసుకునే పద్ధతి, తిరిగి యిచ్చే పద్ధతి..... ముఖంలోని కంగారు..... మాటల్లోని తడబాటు...... యివన్నీ చూస్తున్న ప్రయాణీకులకు అతనో పెద్ద కాలక్షేపమై పోయాడు.

"నీ కెందుకయ్యా ఈ ఉద్యోగం!" అడుగుతున్నారు కొంత మంది ముఖంమీదే!

అయినా ఇలాంటి మంచకోడి వాళ్ళని ఈ రూట్లలో వేసిన వాళ్ళకి బుద్ధి ఉండాలి.

అతని ముఖంలో కళలేదు. ఎవరేమంటున్నా మారు పలక్కుండా తన పని తాను చేసుకొంటున్నాడు.

"క్రొత్త వాడై వుంటాడు. కాస్త మనం సహకరించాలి" అన్నాన్నేను గట్టిగానే!

కండక్టర్ వేగంగా టిక్కెట్లు కొట్టలేక పోతున్నాడు. ప్రయాణీకుల మాటల ఈటెలకు తట్టుకో లేని కండక్టర్ రైట్ అని అరిచాడు.

బస్సు బయలు దేరింది.

బస్సు కుదుపులకి బ్యాలెన్సు చేసుకో లేక తూలిపోతూ - పడిపోతానేమో నని భయ పడుతూ టిక్కెట్లు కొడుతున్నాడు. బస్సు వెడుతూనే ఉంది.

అతను టిక్కెట్లు కొడుతూనే ఉన్నాడు.

కంగారులో డబ్బులు తక్కువ యిచ్చి చివాట్లు తింటున్నాడు. ఎక్కువ యిచ్చి అవమానం

# శాశ్వత నరకం

## ధర్మపథం




మంచి పనులు చెయ్యడానికే అందరూ ప్రయత్నిస్తారు. మంచి పనులవల్ల పుణ్యం లభిస్తుంది. దానివల్ల స్వర్గాదులైన ఉత్తమ లోకాల నివాసం లభిస్తుంది. తెలిసిగాని, తెలియకగాని పాప కార్యాలు చెయ్యడం కూడా మానవ స్వభావమే! అట్టి పనులవల్ల పాపమూ, పాపంవల్ల నరకమూ సంభవిస్తాయి. పాప పుణ్యాల పరిమాణం వారి వారి పనులనుబట్టి ఉంటుంది. చిన్న అపరాధం చేసిన వానికి తక్కువ శిక్ష, పెద్ద తప్పు చేసిన వానికి కఠిన శిక్ష విధించబడుతూ ఉంటుంది కదా! అలాగే మంచి పని చేసిన వానికి ఆ పనినిబట్టి ప్రశంసా, బహుమతీ దొరుకుతూ ఉంటుంది.

సంపాదించిన మహా పుణ్యానికి ఫలంగా స్వర్గం లభించినా, శాశ్వతంగా అక్కడ ఉండడం సాధ్యం కాదు. పుణ్యం క్షీణించగానే వారు తిరిగి భూలోకానికి రావలసినదే! ఈ విషయాన్నే "క్షీణే పుణ్యే మర్త్య లోకే విశంతి" అనేది తెలియజేస్తున్నది. ఆ విధంగానే పాప ఫలమైన నరకాన్ని అనుభవించిన తర్వాత, అక్కడ నుండి విడుదల లభిస్తుంది.

తనకు ఉపకారం చేసిన వాడికి, అవసరమైన సమయంలో ప్రత్యుపకారం చెయ్యడం ధర్మం. దానికి శక్తి లేనప్పుడు, ఆ ఉపకారాన్ని గుర్తిస్తూ కృతజ్ఞత తెల్పడం కనీస ధర్మం. అలా చెయ్యకుండా, ఆ ఉపకారికి అపకారం తలపెట్టడం కంటె మహా పాపం మరొకటి ఉండదు. ఆ విధంగానే మిత్రుడికి ద్రోహం చెయ్యడమున్నూ మహా పాపం! కష్ట సమయంలో బంధువులు ఉపేక్షించవచ్చును కాని మిత్రుడు ఉపేక్షించడు. అతడు తన ప్రాణాన్నయినా ఇవ్వడానికి సిద్ధంగా ఉంటాడు. అట్టి వానికి ద్రోహం చేసినవాడు పశువుకంటే హీనుడు. ఇంక ఇట్టివాడే మరొకడు విశ్వాస ఘాతకుడు. తొలుత బాగా నమ్మకం పుట్టించి, ఆ తర్వాత మోసగించి అపకారం చేసినవాడు ఈ విశ్వాస ఘాతకుడు. ఈ ముగ్గురూ తోటి దొంగలని చెప్పవచ్చును. ఇట్టి వారికి నరకం తప్పదు. అది పరిమితమైన కాలం కాదు. సూర్య చంద్రులున్నంత వరకూ శాశ్వతంగా వారు నరకాన్ని అనుభవించవలసినదే! ఈ విషయాన్నే సహృదయులైన విద్యావేత్తలు ఎన్నడో చెప్పారు-

"మిత్ర ద్రోహీ కృతఘ్నశ్చ
యశ్చ విశ్వాస ఘాతకః
త్ర యస్తే నరకం యాంతి
యావచ్చంద్ర దివాకరమ్" అని.

అందువల్ల ఇట్టి వారిని దగ్గరకు చేర్చకూడదు. వారికి మనం చాలా దూరంగా ఉండాలి.

-బులుసు వేంకట రమణయ్య

పొందుతున్నాడు.

ముందూ వెనుకా వాహనాలు పరిగెత్తుతూనే ఉన్నాయి. నేల తల్లి ఈనినట్లుగా జనం తిరుగుతూనే ఉన్నారు. అంగళ్ళు నోళ్ళు తెరచి జనాన్ని మ్రింగుతూనే ఉన్నాయి. బాగా చీకటి పడిపోయింది. టిక్కెట్లు యివ్వడం పూర్తి కాక పోవడం వల్ల బస్సు నత్త నడకలా నడుస్తోంది. ప్రయాణీకులు తమ అసంతృప్తిని ఈలల ద్వారా కేకల ద్వారా ప్రకటిస్తూనే ఉన్నారు.

కిటికీ ప్రక్కనే కూర్చుని కిటికీ అద్దాలకి తల ఆన్చి నిద్ర పోవడానికి ప్రయత్నిస్తున్న నాకు- ఒక్క కుదుపుతో బస్సు ఆగడంతో ముందుకు తూలి పడబోయి నిలద్రొక్కుకొని పరిసరాలు చూశాను.

జనంలో అలజడి.

బయట జనం అరుస్తున్నారు.

## ఈ చావుకి కర్తలెవరు?

ఇంకా కొంత మంది కంగారు పడుతూ బస్సు దిగుతున్నారు.

'ఏమైంది?' అడిగాను పద్మని.

పద్మ కళ్ళు మూసుకొని- "అబ్బా నేను చూడలేదు బాబూ ఆ దృశ్యాన్ని, కండక్టర్ గేటు దగ్గర నిలబడి టిక్కెట్లు కొడుతూ తూలి పడ్డాట్ట" అంది.

ఆ వార్త విన్న నా గుండె ఆగినట్లు అయింది.

వెంటనే బస్సు దిగి చూశాను.

కండక్టర్ బస్సు వెనుక చక్రం క్రింద పడి ఉన్నట్టున్నాడు. అప్పటికే తుది శ్వాస వదిలేశాడు.

మూగ వారంతా ఒకే చోటకు చేరినట్లుగా ప్రయాణీకులు నోట మాట రాక ఆదృశ్యాన్ని చూస్తూ నిలబడి పోయారు. కండక్టర్ ప్రక్కన కూర్చుని వున్న డ్రైవర్ మెల్లిగా లేచి నిలబడ్డాడు. అందరి కేసి చూస్తూ, బాబూ! ఇప్పుడు మీకందరికీ హాయిగా ఉందయ్యా! మీ కాలశ్యమై పోతోందని ఆ కుర్రాణ్ణి కంగారు పెట్టేశారు. మాటల బాణాలతో మనసును కుళ్ళ బొడిచేశారు. క్రొత్తగా డ్యూటీలో చేరిన మనిషికి కాస్త చేయూత నియ్య లేరా?" అంటూ గొల్లుమన్నాడు.

ఎవరూ నోరు విప్పి ఓదార్చ లేని సమయం.

తమ హాస్యానికి – తమ అసహనానికి బలైపోయిన ఆ అమాయకుని మృత దేహాన్ని చూస్తూ కన్నీరు కార్చడం తప్ప- ఎవరూ మాట్లాడలేని సమయం. సాటి మనిషి బలహీనతను ఆసరాగ తీసుకొని అపహాస్యం చేసే నేటి సమాజానికి పెద్ద సవాల్‌గా రోడ్డు మీద కుప్పగా పడి వున్న కండక్టర్ శవం అడుగుతున్నట్లుగా అనిపిస్తోంది నాకు..... ఈ నా చావుకు కర్తలెవరని? □

# కోటయ్య అనుభవం- కోటయ్య నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ళ రైతులు.
ఎన్నాళ్ళనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.



న్యూ ఇండియా ఎష్యూరెన్స్

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

## భర్త వేధింపు – భార్య ఆత్మహత్య!

హైదరాబాదులో అశోక్ కుమార్ అనే ఆయన తన మొదటి భార్య క్షయ రోగంతో మరణించగా నాగమణి అనే ఆమెను వివాహం చేసుకుని, ఆనక ఆమెను వేపుకు తిన నారంభిస్తే ఆ చిత్రవధ భరించవేక నాగమణి తన 23 ఏళ్ళ జీవితాన్ని విషంతో అంతం చేసుకున్నదట. అశోక్ కుమార్ సివిల్ సప్లయిస్ విజిలెన్స్ సెల్‌లో సబిన్స్పెక్టరుగా పని చేస్తున్నాడట.

## వార్తా పత్రికల భవిష్యత్తు!

భారత దేశంలో పత్రికల సంఖ్య, వార్తా పత్రికల సంఖ్య చాలా ఎక్కువ వేగంతో పెరుగుతోందట. 1984 సంవత్సరాంతానికి దేశంలో 21,784గా వున్న యీ సంఖ్య 1985వ సంవత్సరాంతానికి 22,648గా రూపొందిందట. వార్తా పత్రికలకు యింకా అఖండమైన పెరుగుదల, భవిష్యత్తూ వున్నట్టు తత్ సంబంధ నిపుణులు అభిప్రాయ పడుతున్నారట.

## విదేశాల నుంచి కిటకాల దిగుమతి!

గుర్రపుడెక్క అనే వో రకం అందమైన పూలు పూచే మొక్కలను అలనాడు బ్రిటిష్ వారు మన దేశానికి తెసుకు వచ్చారట. ఇది సరస్సుల్లో అతి చురుకుగా పెరిగి, అల్లుకుపోయి, కొన్నాళ్ళలో సరస్సును మూసేస్తుందట. ఈ పరిస్థితి కొల్లేరు సరస్సుకు ఏర్పడిందట. ఏంతో అధికారులూ, విజ్ఞానులూ బుర్రలు బాదుకుంటున్నారట. ఈ మొక్కలను నాశనం చేసే శక్తి ఒక రకం కిటకాలకు వున్నదట. ఈ




కిటకాలను విదేశాల నుంచి దిగుమతి చేసుకున్నదట ఆంధ్రదేశం. ఈ పురుగులు ఒక్కొటి ఏడాదికి 300 గుడ్లు పెడుతుందిట. ఇవి మూడు నెలలో పెద్దవయి, మళ్ళీ గుడ్లు పెడతాయట. ఇవి యీ మొక్కలను తిని, చంపేయ గలవట. ఈ కిటకాలు బ్రెజిల్‌లో చాలా ఎక్కువగా వుంటాయట. ఇవి మనిషికి గానీ, మనిషి ఉనికికి గానీ ఎలాటి హాని చేయవట.




## హత్యా! ఆత్మహత్యా!

హైదరాబాద్ మలకపేటకు చెందిన సుహాసిని అనే ఆమెకు మొన్న ఏప్రియల్ నెలలో వేణుగోపాల రెడ్డితో వివాహం జరిగిందట. ఆనాటి నుంచి ఆమె భర్తా, బావగారూ, ఆయన భార్యా కలసి ఆస్థిలో భాగాన్ని పంచుకురమ్మనమని ఆమెను వేధించేవారట. ఈలోగా ఆషాఢ మాసం వచ్చినందు వల్ల ఆమె తన తలిదండ్రుల యింట్లో వుండ నారంభించిందట. ఒక రోజామె భర్త ఆ యింటికి వచ్చాడట. మర్నాటి వుదయానికి ఇద్దరూ చావు-బ్రతుకుల మధ్య ఆసుపత్రిలో చేర్చబడ్డారుట. నిద్ర మాత్రలు మింగిన ఫలితాన్న వచ్చిన యీ వుపద్రవం లో సుహాసిని చనిపోయిందట. దీనికి సుహాసిని తల్లి పోలీసు ఫిర్యాదు యిచ్చి రెడ్డి వో పథకం ప్రకారం తన యింటికి వచ్చి తన కూతురుకు హెచ్చు మోతాదులో నిద్రమాత్రల పొడి వేసిన పాలిచ్చి, తాను లాంఛనంగా త్రాగాడని, కనుకనే అతను కోలుకున్నాడనీ, ఆత్మహత్య చేసుకుంటున్నట్టు తన కూతురు రాసిన వుత్తరం ఆమె దస్తూరీ కాదని, సంతకం కూడా ఆమెది కాదనీ పేర్కొన్నదట.

## శిలగా మారిన పాము!

తమిళనాడుకు చెందిన నాగర్‌కోయిల్ అనే వూరులోని నాగేంద్రని గుడిలోని ధ్వజ స్తంభం మిద మూడేళ్ళ క్రితం వో వుత్సవంలో ఓ చిన్న పాము పాకుతూ భక్తులకు కనబడిందట. అందరూ చూస్తుండగా ఆ పాము ధ్వజ స్తంభం పైకి ఎక్కి అక్కడ నుంచి క్రిందికి దూకి, ధ్వజ స్తంభం పునాదిలో వున్న రాతి మిద పడి, శిలగా మారి పోయిందట. ఆ ధ్వజ స్తంభం రాయిమిద యిప్పటికీ వో మూల ఆ శిల వుంది. అది మూడేళ్ళ క్రితం లేదనీ, ఆ పాము పడి శిలగా మారిపోయిందనీ ఆ వూరి వారు భక్తితో, పారవశ్యంతో చెప్తారు.

## మందుల పిచ్చి!

అమెరికా లింకన్ షైర్‌కు చెందిన శాంజన్సన్ అనే ఆయన వో 22 ఏళ్ళలో 2,27,000 మాత్రలను, 40,000 సీసాల మందునూ త్రాగాడట. ఏ చిన్న అనారోగ్యం వచ్చినా ఆ ఛాదస్తుడు మందు తిసుకోందే నిద్రపోయేవాడు కాదట.

## భార్య ప్రియుడ్ని భర్త హత్య!

కళ్ళపట్టి అనే గ్రామానికి చెందిన తంగరాజు భార్య కాచమ్మ వో కాఫీ హోటలు నడిపేదట. తంగరాజు పచారి షాపు నడిపేవాడట. ఆ కాఫీ హోటలుకు రోజూ వచ్చే కాంతిరామన్ అనే అతనికి, కాచమ్మకు ప్రేమ ఏర్పడి అది రహస్య కామాయణంగా స్థిరపడ్డదట. ఈ విషయం తెలిసిన తంగరాజు కోపంతో ఎగిరి గంతేసి, పెళ్ళయి పదిహేనేళ్ళయి,ముగ్గురు పిల్లల తల్లివయ్యుంది యిదేం తెగులు అనడిగితే అదో ప్రేమ అందామె సింపుల్‌గా. ఈ విషయంలో వూరు పంచాయితీ విచారించి, వారిద్దరూ ఒకర్నొకరు కలువరాదన్నారట. దాంతో యిద్దరూ అర్ధరాత్రిలో వో తోటలో ఎంచక్కా కలుసుకుని కామతృష్ణ తీర్చుకునేవారట. ఇది కనిపెట్టిన తంగరాజు ఆ తోటలో కాసి, కాంతిరామన్ను కత్తితో పొడిచి చంపేశాడట.

## ఇంజన్ ఆపినా కారు కొండ ఎక్కే చోటు!

కెనడా మాంక్టన్‌ఘాటులో వో చోట కొండపైకి వెళ్ళే రోడ్డు వారగా వో ఆశ్చర్యకరమైన పెద్ద బోర్డు వుంటుందట. దాంట్లో "ఇలా యీ కొండ పైకంటా మి కారు ఎక్కడానికి ఇంధనం ఖర్చు లేదు. కారు ఇంజన్ ఆపేయండి. ఇంజను ఆపినా మి కారు హాయిగా యీ కొండ ఎక్కగలదు" అని వుంటుందట.




ఈ వింత ఎందుకు జరుగుతోందో, ఏ శక్తి పని చేస్తోందో శాస్త్రజ్ఞులకు అంతు చిక్కకపోయినా ఆ అద్భుతం మాత్రం జరుగుతూనే వున్నదట. ఇది 1802లో మొట్టమొదటి సారి వో గుర్రం లేని బండికి జరిగిందట. గత యిన్నేళ్ళుగా యీ వింత, అద్భుతం అలా జరుగుతూనే వుందిట– శాస్త్రానికి లొంగని, అంతు చిక్కని అద్భుతాలు ప్రపంచంలో అనేకం వున్నాయి. □

# హైదరాబాద్ నోట్‌బుక్

## నగరంలో మురికి వాడలు:

ఇటీవల బెంగుళూరు వెళ్లాను. అలాగే తిరువేంద్రమూ చూచాను. దక్షిణాదిన వున్న ఈ రెండు రాష్ట్రరాజధానులకు ప్రకృత్యనుగ్రహం వుంది కాబోలు! కలకలలాడుతున్నాయి. వీధులు శుభ్రంగా వున్నాయి. పార్కులలో, రోడ్ల మధ్యన పొడుగ్గా పెంచిన లఘ్వారామాలలోని పూవులను ఎవరూ గిల్లుకోపోవడం లేదు. గులాబీలు నన్ను, నా మిత్రులను చూచి నవ్వాయి. నాకేమో ఆ నవ్వు వెక్కిరింపుగా తోచింది.– మీ రాష్ట్ర రాజధాని ఎలా వుంది? మేమిక్కడ హాయిగా వున్నాము. మా నెత్తిన ఎవరూ దుమ్ము పోయడం లేదు. పిడకలు తట్టడం లేదు. పీక్కుని పోయి తమదొడ్లో నాటుకోడం లేదు– అన్నట్లనిపించింది. అక్కడి వీధుల్లో తిరిగాను. మన నగరం అందమైంది, శుభ్రంగా పెట్టుకోండి– అనే నినాదాలూ కనిపించలేదు. అక్కడ మురికి వాడలు లేవని కాదు. ఉన్నాయి. అవి, మన రాష్ట్ర రాజధానిలోని రాజ మార్గాలలాగ వున్నాయి. మనకు వేదకాలం నుంచి చరిత్ర వుంది. మహామహా మేధావులు మన జాతిలో జన్మించారు. మగధ పాలించారు, జావాసుమత్రాల నెగుర వేశారు జయపతాక. కాని, మనకు లేంది ఒకటే – పౌర చైతన్యం. అది ఏమాత్రం వున్నా మన నగరాలు, పట్టణాలు ఇలా వుండేవా? ప్రకృతి ఒకొక ప్రాంతానికి ఒకొక వరం ప్రసాదించింది– కన్నెర్ర చేసినప్పుడు తుఫానులు రావడమో, అగ్ని ప్రమాదాలు జరుగడమో తప్ప. సారవంతమైన భూమి. పరిశ్రమ శీలులైన ప్రజలు. అంతా వుంది. లేంది ఒక్కటే– అది ముందే చెప్పాను. హిందీలో ఒక సామెత వుంది. హిందువోంకీ గల్లీ ఖరాబ్, ముసల్మానోంకే చూల్హీ ఖరాబ్ – అని. హిందువులకు తమయిల్లు శుభ్రంగా వుండాలి కాని, వీధి పరిసరాలు వుండక్కరలేదు. అంతా వీధిలో పడేస్తారు. ముస్లింలు అంతా వంటింట్లోనే తోసి మురగ వేస్తారు– అని ఈ సామెత అర్థం. ఈ సామెత తెలుగు వారికి పూర్తిగా వర్తిస్తుందని నా అభిప్రాయం. ఒక మారు నగరంలో తిరిగిరండి. బాగయాములో కూడ కూర్చోలేము. ఉదయం టాంక్ బండ్‌కు వాహ్యాళికి, వెళ్ళుతామనుకోండి. బహిర్దేశ పరాయణుల దర్శనం లభిస్తుంది. మన ముఖ్య మంత్రి గ్రామీణ స్త్రీలకు బహిర్దేశ పథకం పెట్టారుగాని, నగరంలో ఆ పథకం అమలు పరిస్తే బాగుండును. సాయంత్రం ఏవైపుకైనా వ్యాహ్యాళికి వెడుదామా అంటే, అదీ కుదరదు. నగరానికి నడి బొడ్డయిన ఆబిద్ సర్కిల్‌లో ఇరుగు పొరుగు వీధుల మురికి చూస్తే, తల తిరిగిపోతుంది. ఆబిద్ సర్కిల్ నుంచి నాంపల్లి స్టేషన్‌కు పోయే రోడ్డులో వందగజాలు నడవండి. ఎడమ సందుల్లో పేరుకొన్న మురికి మూడు తరాలదా అనిపిస్తుంది. వెనక్కు వచ్చి, మొజంజాహి మార్కెటు వైపు నడవండి. మార్కెటులో అడుగు పెడితే, కూరగాయలు కొనడం మానేస్తాము కదూ! కాదు. కొంటాము. సర్వైవల్ టుది ఫిట్టెస్ట్ సూక్తి వుండనే వుంది. అన్ని మురికి విషాలనూ జీర్ణించుకొని బతుకతాం. లాల్ బహదూర్ స్టేడియం ముందు, నిజాం కాలేజి ముంగిట్లో చూడండి. రెండు సంవత్సరాలుగా రోడ్డు మరమ్మత్తులో వుంది. కాలం అనంతం కదా! అలాగే బషీర్‌బాగ్ వచ్చి, చౌరస్తా దాటి కుడివైపు స్కైలైన్ సినిమాకు మళ్లే వీధిలో అడుగుపెట్టండి. చిన్న వీధి, సగం మేర స్కైలైన్ సినిమా వరకు పెంట కుప్పలతో మురిగి కంపు కొడుతూంటుంది. తొక్కుకుంటూ నడుస్తాం. చెప్పులున్నాయిగా, మురికి కాళ్లకు అంటదు. అటే ఎడమ వైపు మళ్లీ పాత ఎం. ఎల్. ఎ. రోడ్డులో నడవండి. మాతృశ్రీ అపార్ట్‌మెంట్స్ అంబరచుంబి భవనావళి. దాని ముందు, రోడ్డులోను మురికి దిబ్బలు ఆ భవనంతో పోటీ పడుతుంటాయి. కోఠీ సర్కిల్ చూస్తారా? రండి. కోఠీ పోస్టాఫీసు ప్రాంతం కొన్ని వందల బస్సులు ఆగే స్థలం. అక్కడ కోట్ల రూపాయల వ్యాపార స్థలం కదా! ఎంతో శుభ్రంగా వుండాలికదా! పెంటకుప్పలు. అలాగే బస్సురూటులో వెళ్లండి. ఎడమ వైపు మూసీనది. పాపం!మహాభియంత (ఇంజనీరు) భారతరత్న మోక్షగుండం విశ్వేశ్వరయ్య పుణ్యమా అని అడ్డు కట్టలలో పడి దురపిల్లుతూంది. నగర మధ్యంలో ఆనది గట్టు పొడువునా ఫుట్‌పాత్ మీద పిడకల పరిశ్రమ. రామాయణంలో పిడకల వేటలాగ వుంది కదూ! వర్షం వచ్చినప్పుడు చూడాలి. ఇది నిజంగా వేటలాగే వుంటుంది. నారాయణగూడాకు వెళ్ళుదామా? అక్కడ తాజ్‌మహల్ హోటల్‌ముందు వెదురు దుకాణాలు ఒక వైపు, మరొక వైపు మురికి సందులు. వెదురు దుకాణాల వాళ్ళు ఫుట్‌పాతులను ఆక్రమించుకొని పని చేస్తారు. బస్సుకోసం వేచివుండే వారిపై వెదురు చువ్వలు పడుతుంటాయి. ఏం చేస్తాం? బస్సుల కోసం వేచివుండాలిగా. వాళ్లతో పోట్లాడామా, వాళ్ల వెంట మహానాయకులుంటారు. ఇంకో సంగతి. తెలుగు వాడికి కిడ్నీ ట్రబుల్. ఏ సుందర దృశ్యం చూచినా, ఏ మనోహర గానం విన్నా, మూత్ర పిండాలు పనిచేస్తాయి. పూర్వాపర విచక్షణ లేకుండా మూత్రిస్తాడు. ఆ మధ్య ప్రపంచ తెలుగు మహాసభలకు మలేషియా వెళ్లాము. అక్కడ శయాన బుద్ధవిగ్రహం అత్యద్భుతంగా వుంది. దాని చుట్టూ రెండు వందల గజాల వరకు మంచి పచ్చిక బీడు, తోట. సభకు వెళ్లి, ఆ విగ్రహాన్ని చూస్తున్న మన తెలుగు వారి మూత్ర పిండాలు కదిలాయి. ఇకనేముంది? ఆ పచ్చిక మైదానాన్ని పవిత్రం చేశారు. ఇంతలో పోలీసులు వచ్చారు. ఫైను చెల్లించాములేవయ్యా. వుండు. పూర్తికానీ– అన్నాడు నాయకుడు. ఇండియా సరుకా? ఫో– అంటూ వాళ్లు వెళ్లిపోయారు. అక్కడ మూల మూలకూ పదడుగుల్లో మూత్ర శాలలున్నాయి కదా. వెళ్లలేక పోయారా?– అని అన్నాను. ఏం కొంపమునిగిందిట! ఎప్పుడూ సన్నగా వాన పడుతుందాయె. కొట్టుకు పోదూ?– అన్నాడు ఆయన. ఇదీ మన వైఖరి. కనుక మనకు పౌరచైతన్యం వచ్చే వరకు మన నగరం బాగుపడదు. విదేశాలకు వెళ్లి వచ్చిన మన వాళ్ళు అక్కడి తమ అనుభవంతో కొంత కృషి చేస్తే పౌర చైతన్యం కలుగవచ్చునేమో! ఆ మధ్య ఒక అంతర్జాతీయ మహాసభలో ఒక ఇటాలియన్‌తో పరిచయమయింది. ఆయన హైదరాబాదు, విశాఖపట్నం, బెజవాడ చూచి థ్రిల్లయిపోయి, "ఏమి ప్రకృతి వరం. ఊరి మధ్యన కొండలు, కాలువలు, నదులు, ఎంత అందంగా పెట్టుకోవచ్చు!" అని చిందులు తొక్కాడు. భాయీ! అంతా వుంది. అల్లుడినోట్లో శని వుంది– అన్నాను. ఏమిటన్నట్టు ముఖం పెట్టాడు. మాకు పౌర చైతన్యం లేదు– అన్నాను. అతను మాట్లాడలేదు. విదేశీయులు మన దేశానికి వచ్చినప్పుడు విరుద్ధ వ్యాఖ్యలు చేయరాదని నిర్ణయం. కనుక పెదవి కదపరు వాళ్ళు. స్వదేశానికి పోయి ఉత్తరం వ్రాశాడు– కొంత శ్రద్ధ తీసుకుంటే ఆంధ్రప్రదేశ్ లోని పెక్కు నగరాలు వెన్నిస్‌ను తలదన్నుతాయని. సరే., మనకు భగవంతుడు పౌర చైతన్యం కలిగించు గాక!

## ఉపశ్రుతి:–

పెళ్లి చూపులు జరుగుతున్నాయి. కన్యాపిత చెబుతున్నాడు కన్య గుణగణాలు: అమ్మాయండీ, పోస్ట్ గ్రాడుఏటండీ. సంగీతంలో డిప్లొమాండి. అదనపు క్వాలిఫికేషనండి, కరాటేండి..... పెండ్లి కొడుకు వైపు వాళ్ళు అదరి పడ్డారు. అదెందుకండీ? – అన్నారు. మీది ఆడపడచులూ, మరుదులూ ఎక్కువగా వున్న కుటుంబం కదండీ. ఎప్పటికైనా వుపయోగిస్తుంది – అన్నాడు కన్యాపిత.

–తిరుమల రామచంద్ర

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd.,*
*by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,*
*Editor: S. Radhakrishna; Phones :- Business : 61247, 61248, Editorial: 75667*



ఇటీవల విజయవాడలో నృత్య ప్రదర్శన ఇచ్చిన నర్తకి, వర్ధమాన సినీనటి కుమారి చల్లా జయలలిత.

# అవీ - ఇవీ - అన్నీ

## నెల్లూరులో అక్కినేని జన్మదినోత్సవం

నెల్లూరు అక్కినేని ఆర్ట్సు అసోసియేషన్ వారు అక్కినేని నాగేశ్వరరావు గారి జన్మదినోత్సవాన్ని నెల్లూరు టౌన్ హాలులో అతివైభవంగా జరుప నిశ్చయించినారు. ఈ సందర్భంగా సెప్టెంబరు 19, 20 తేదీలలో అఖిల భారతస్థాయిలో ఏకపాత్రాభినయం, జానపద నృత్యములు, రికార్డు డ్యాన్సులలోను మరియు శాస్త్రీయ సంగీతం, జానపద గేయాలు, సినిమా పాటలలోను పోటీలు నిర్వహిస్తారు. ఈ పోటీలకు న్యాయ నిర్ణేతలుగా సినీ దర్శకులు, సినీ నృత్య దర్శకులు, సినీ సంగీత దర్శకులు వ్యవహరిస్తారు. నృత్య పోటీలలో గెలుపొందిన వారికి "నాట్యరాణి", "నాట్యరాజ" అవార్డులను, పాటల పోటీలలో గెలుపొందిన వారికి "మధుర గాయని", "మధుర గాయకుడు" అవార్డులను బహుకరిస్తారని ఆ సంస్థ కార్యదర్శి తెలియచేసారు.

వివరములకు సెక్రటరి, అక్కినేని ఆర్ట్సు అసోసియేషన్, నియర్ అనితా హాల్ – నెల్లూరు –524003 అనే చిరునామాకు రాయాలి. □

# టెక్నాలజీలో అత్యున్నత శిఖరాల నధిరోహిస్తూ...



# తోషిబా
# డిజియానా

## 207 R3E
## రిమోట్ కంట్రోల్ మోడల్




ఎలక్ట్రానిక్ యుగాన్ని సృష్టించి మౌంట్‌ఫ్యూజీ శిఖరాన్ని అధిష్ఠించిన జపాన్‌వారి వినూత్న అధునాతన తోషిబా టెక్నాలజీ అపూర్వసృష్టి డిజియానా టి.వి. డిజియానా 207 R3E కార్డ్‌లెస్ రిమోట్ కంట్రోల్ మిమ్ములను సమ్మోహితం చేస్తుంది. ఒక్క బటన్ నొక్కితే చాలు ప్రపంచాన్ని మీ కళ్ల ముందుంచుతుంది. బొమ్మలో సజీవ స్పష్టత శబ్దంలో సహజ విశిష్టత కలబోసుకున్నది డిజియానా టి.వి.

మీ కంటికి ఎటువంటి హాని, అలసట, ఆటంకం - కలిగించని స్క్రీన్ ఉంది. దీని సున్నితమూ, సుందరమూ అయిన రూపం మీ ఇంటికి, కంటికి హుందాగా కొత్త వెలుగు లిచ్చే దీపం. మీ ఇంటికి తరిగిపోని శ్రీవి, డిజియానా టి.వి. ఈ రోజే మిమ్మల్ని మంత్రముగ్ధుల్ని చేసే డిజియానా వినోద ప్రపంచంలో అడుగుపెట్టి చూడండి !

మాపురంగులనిచ్చే పసుపు బంగరు
యాత్రలకు కారణం ఆయుర్వేద మూలికలే.

# హిమానీ గోల్డ్

## టర్మరిక్ సబ్బు మరియు క్రీమ్.



ఎవరికి తెలియదు చర్మ సౌందర్యాలకు పసుపు ఎంత సహాయ కారిణి అని. కానీ యీ తొందర రోజులలో శనగపిండితో కలిపి ప్రతి దినం ఎవరు వాడతారు... శనగపిండి లేకుండా కేవలం పసుపు మాత్రం కలిసి ఉన్న చర్మ సౌందర్య సాధనాలు ఎలా చర్మాన్ని కాపాడగలవు ?

సంవత్సరాల తరువాత యీ సమస్యకు సమాధానంగా కనిపెట్టారు భారత విఖ్యాత రవీంద్ర పురస్కార విజేత శ్రీ శివకాళీ భట్టాచార్యగారు సౌందర్య సాధనాలలో కలిపేందుకు గాను పసుపుతో సహా తులసీ, గోరింట వట్టి వేళ్ళు, చందనం మరియు వర్మకముతో నవమూలికల గుణములు కలిపినట్లయితే చర్మ సౌందర్యాలకు పసుపు ఇస్తుంది ఒక ప్రత్యేకతను. శనగపిండి లేదే అన్న సమస్య మరి లేదు. సంపూర్ణ బంగరు ఛాయలు అలా నిలుస్తాయి.

అవును—ఆయుర్వేదపు యీ అమూల్య అన్వేషణా ఫలితం లభిస్తోంది పూర్తిగా హిమానీ గోల్డ్ టర్మరిక్ సబ్బు లేక హిమానీ గోల్డ్ టర్మరిక్ క్రీమ్‌లో సదా. ఇదే భారత దేశంలో ప్రప్రథమం.

ఇప్పుడు మీ చర్మంలో క్రీమ్ మరియు సబ్బుల యొక్క ఆయుర్వేద గుణం అతి సహజ సౌందర్యాలతో మిళితమై శరీరం బంగరు ఛాయలతో మిరుమిట్లు గొలుప్తోంది.

అవును—అందరు అందాలను రెప్ప వేయకుండా చూస్తారు.

శాస్త్రాలలో వర్ణించబడిన నవ ఔషధాల శ్రేష్ఠగుణములు:



పసుపు : ముఖానికిస్తుంది అందాల ఆహ్లాదాలను.



గోరింట : రంగురూపాలను అధిక కాంతివంతం చేస్తుంది.



తులసి : చర్మంపైన మరకలను నిర్మూలిస్తుంది.



చందనం : ఆరిన చర్మాలకు అందాల నిస్తుంది.



వర్మకము: చర్మ రోగాలను నిర్మూలించి జీవాణువులను నాశనం చేస్తుంది.



*కొబ్బరినూనె : చర్మ కోమలత్వాన్ని సహజ సౌందర్యాన్నందిస్తుంది.



*వేపనూనె : జీవాణువులను నష్టపరచి చర్మరోగాలను నిర్మూలించేందుకు దోహదాన్నిస్తుంది.

*సబ్బులో మాత్రమే.




హిమానీ గోల్డ్ సబ్బు మరియు క్రీమ్

బంగరు నదివాల సౌందర్యాన్ని తిరిగి తీసుకొస్తోంది

9680A/1TEL